

# రచయిత పరిచయం

**రచయిత:** కవితా (వేంకట సూర్య నారాయణ) ప్రసాద్

**జననం:** 1955

**ఊరు:** అవనిగడ్డ, కృష్ణాజిల్లా (ఆం.ప్ర)

**తల్లిదండ్రులు:** వాస్తు జ్యోతిష విద్వాన్, దైవజ్ఞరత్న బ్రహ్మశ్రీ కవితా కామేశ్వర శర్మ, రాజ్యలక్ష్మి.

**చదువు:** MSc (chemistry), PG Dip. (Appd. Statistics),(PhD)
స్కంధ త్రయ జ్యోతిషము (వారసత్వము).

**వృత్తి:** D.G.M (retd.), ONGC.

**అభినివేశము:** పద్య, వచన కవిత్వములు, కథారచన,
వాస్తు జ్యోతిష ముహూర్త శాస్త్రములు.

**రచనలు:** వివిధ పత్రికలలో పద్య గద్య కవితలు, కథలు, వ్యాసాలు,
ఆకాశవాణి పద్య సమస్యాపూరణలు,
వివిధ కవితా సంకలనములలో రచనలు.

**గ్రంథములు:** శ్రీ రాజశేఖర శతకము,
శ్రీ వేంకటేశ్వర ద్విశతి,
కొరోన వారణార్థనా పద్యపంచాశిక
కావవే కామేశ్వరీ!! (శతకము),
ప్రవచన కవితా (౨) కవితలు (వచన కవితా సంపుటి),
మాటవెలదులు (పరశ్శతకము),
ప్రపద్యాపీడము (ఖండ పద్యకవితా సంపుటి),
ఇష్టకథాష్టకము (కథాసంపుటి),
శ్రీ లలితా మధురాక్కరలు
ముహూర్త కామేశ్వరము. మొ.

# ఇష్టకథాష్టకము

## (సంకలనం)

**+**

## (రెండు బోనస్ కథలు)


## కవితా ప్రసాద్

**కందుకూరి వేంకటేశ్వర్లు ❖ కవితా శ్రీనివాస్**





**శంకరాభరణం**

శరణం పండిత మానసాపహరణం, శశ్వద్యశఃకారణం, సరసానందద వాగ్విలాస చరణం, శబ్దార్థ సంపూరణమ్।
చరదత్యద్భుత సత్కవీశ్వరగణం, సాలంబనం 'శంకరాభరణం', నిత్యమహం స్మరామి విలసద్ వాగ్దివ్యసింహాసనమ్।

**ఇష్టకథాష్టకము**

సంకలన కర్త: కవితా ప్రసాద్



**ప్రథమ ముద్రణ:** ఆగష్టు 2022

**కాపీలు:** 100

**శంకరాభరణం ప్రచురణలు:** 67

**ప్రాప్తిస్థానం:** Kavitha Prasad,
73-18-8/1F, S2 - Sree Nandanam Apt.,
Sree Balaji St., (Near Venkateswara Temple),
A.V. Apparao Road,
Rajamahendravaram-533103 (AP)
✆: 9490168907

**వెల:** అమూల్యము

**డిజైన్ & డి.టి.పి.:** పంతుల విట్టుబాబు, హైదరాబాద్, ✆85550 82034
**ముద్రణ:**

# విషయ సూచిక



## బోనస్ కథలు

**K.V.L.N. ప్రకాశ్**

(శ్రీ ఉదయిని)

కథా నవలా రచయిత

Former Scientist, IICT

హైదరాబాద్

## నా మాట

**నా**లుగు దశాబ్దాల క్రితం మిత్రులు కవితా ప్రసాద్ హైదరాబాద్‌లో Geological Survey of India లో ఉద్యోగిస్తూ ఉండేవారు (1980-83). అప్పుడు పరిచయమయ్యారు. కొన్ని విషయాల్లో భిన్న అభిప్రాయాలున్నా రచనల పట్ల ఆసక్తి, అభిరుచి మా ఇద్దరికీ స్నేహం కలిపాయి. తర్వాత ఆయన ONGC లో చేరటంతో హైదరాబాదును వీడటం జరిగింది.

ఆ రోజుల్లోనూ ఇంకా ఆ తర్వాతనూ వ్రాయగా ప్రచురింపబడిన కొన్ని కథలు ఇప్పుడు ఈ సంకలనంగా రావటం సంతోషంగా ఉంది. బోనస్‌గా మరో ఇరువురి కథలను కూడా అందించారు.

కొన్ని రచనలు చదువుతున్నప్పుడు పాఠకులు గమనించకుండానే వారికే మాత్రం తెలియకుండానే ఒక మ్యాజిక్‌కు లోనౌతారు.. ఏదో అదృశ్య హస్తం వారిని పట్టుకొని నడిపిస్తూ అంతవరకూ వారికి తెలియని పరిచయమే లేని వ్యక్తుల సమక్షంలో నిలబెట్టిన భావానికి గురి ఔతారు...కథనంలో గాఢత, స్పష్టత ఎంతగా మెస్మరైజ్ చేస్తాయి అంటే, ఆ వ్యక్తుల హావభావాల గురించి ప్రత్యేకంగా వ్రాయక పోయినా వారి భావోద్వేగాలన్నీ పాఠకుల కళ్ళముందు ప్రత్యక్షమౌతాయి. బహుశ వారి వేషధారణ ఇలా ఉండి ఉండవచ్చు అన్న ఊహ కూడా అసంకల్పితంగా చదివే వారికి కలగచ్చు... అలాంటి అక్షర మాయాజాలాన్ని ఈ సంపుటిలో.. ముఖ్యంగా నీడల క్రీడలు అన్న పెద్ద కథలో చూడచ్చు.

కలాన్ని కెమెరాగా మార్చి అక్షరాలను దృశ్యంగా మార్చటం గురించి ప్రస్తావించినట్లే భేతాళుడి (చెప్పని) చివరి కథలో శివకేశవులతో పాటు ఇంకొన్ని

పౌరాణిక పాత్రల్ని రూపొందించిన తీరు గురించి కూడా చెప్పుకోవాలి. ఎవరికీ అభ్యంతరం కలగని విధంగానూ, మనోభావాలు దెబ్బతిన్నాయి అనే ఫిర్యాదు వచ్చే ఆస్కారం లేకుండానూ శ్రుతి మించని వ్యంగ్యంతో కథ నడుస్తుంది. క్షీరసాగర మథనాన్ని ఒక ఇంజనీరింగ్ ప్రక్రియగా మలచటం, హాలాహలోత్పత్తిని ఎదుర్కొని అదుపులోకి తీసుకొనే యత్నాలను సాంకేతిక పదాలతో వర్ణించటం ఆకట్టుకొంటాయి. ఈ రచన ఆయన "ONGC" లో చేరటానికి దాదాపు సంవత్సరం ముందుగానే వ్రాసి ప్రచురింపబడిన కథ కావటం ఆశ్చర్యంగానే ఉంటుంది. బహుశ premonition ఏమో!

పాఠకుల ఆసక్తి పెంచటానికి నాలుగైదు పరిచయ వాక్యాలు చెపితే సబబే కాని, విస్తరిస్తూ పోతే వారి ఉత్కంఠకు అడ్డుతగలటం ఔతుంది కాబట్టి మిగిలిన కథల గురించి క్లుప్తంగానే ప్రస్తావించటం భావ్యంగా ఉంటుంది. తెల్లబోయిన తెలుగు పాండిత్యం నుంచి కాటేయని కరినాగు వరకు.. ఈ కథలన్నీ కొన్ని దశాబ్దాల క్రితం వచ్చిన రచనలు అన్న భావన కలిగించకుండా చకచకా సాగుతూ హాయిగా చదివించేస్తాయి. కొన్ని కొసమలుపుల మెరుపులు చమక్కుమని చిరునవ్వు తెప్పిస్తాయి. కందుకూరి వేంకటేశ్వర్లు గారి కాటేయని కరినాగు మంచి భావుకత కలిగిన రచన. పాఠకులకు మంచి బోనసే.

చివరిగా కవితా ప్రసాద్ గారి పైన నా ఫిర్యాదు.. రచనా ప్రక్రియలలో కష్టతరమైన పద్య శతకాలను ఇప్పుడు అలవోకగా వ్రాసేస్తున్నారు. ఆయన పద్య రచనలను చదివి ఆనందించగలిగే రసజ్ఞత లేని నా లాంటి సామాన్య పాఠకులను దృష్టిలో ఉంచుకొని ఆయన కథా రచనలో కూడా కొంత ఆసక్తి కనపరిస్తే బాగుండేది... శతకథలు చదివే అవకాశం వచ్చేది కదా అని ఆ ఫిర్యాదు. అలా జరగాలని కోరిక. చదివాక మీకూ అలానే అన్పిస్తుంది. ఈ ఇష్టకథాష్టకం ప్రచురణ ఆ కోరిక తీరే దిశలో అడుగు పడటానికి ప్రేరణ కావాలని ఆశిస్తున్నాను.

అభినందనలతో

ప్రకాశ్ (శ్రీ ఉదయిని)

హైదరాబాద్
23.05.2022

# ముంబల్కు

**ము**న్ముందుగా నమస్కారం.

ఒక వయసులో ప్రతి సాహిత్య ప్రక్రియలోనూ వేలు పెట్టాలనే కండూతితో కథా రచనలో కూడ చేయిపెట్టి గోరు మాత్రమే దూర్చి వదిలేసాను. ఎప్పుడో ..చెప్పే కథలు వింటానికి పెళ్ళాం ఇంకా రాని రోజుల నాటివి. వీయస్సెన్పి కవితా, కవిప్రసాద్, కవితా ప్రసాద్ అనే పేర్లతో వ్రాయబడినవి సరదాగా ఇలా సంపుటీకరించాను. మా బాబాయి టి.కృష్ణమోహన్ 1950 - 1970 కాలంలో 200 కు పైగా నవలలు వ్రాసిన ప్రఖ్యాత రచయిత. పత్రికలలో వ్రాయలేదు. విడిగా అచ్చు పుస్తకాలుగానే వెలువడుతూ ఉండేవి. ఎక్కువగా మద్రాసు MVS publications నుంచి. నా కథా రచనకు ఆయన కూడా ఒక ప్రేరణ. నీడల క్రీడలలో తండ్రి వంశీమోహన్ పాత్ర దాదాపుగా ఆయనే. భేతాళుడి కథా రచన మొదటగా A.U. లో PhD చేస్తున్నప్పుడు రిసర్చి స్కాలర్స్ మాగజైన్‌కు క్షీరసాగర మథన రహస్యం పేరుతో వ్రాసాను. దానిలోకి భేతాళుణ్ణి చొప్పించి మఱికొంత పెంచి ఆంధ్రపత్రికకు వ్రాసాను. అప్పటికి నేను ఇంకా ONGC లో ఉద్యోగి కాలేదు. GSI లో చేస్తూండేవాడిని. కవి సమయాల గురించి చర్చిస్తున్నప్పుడు అధరామృతం అనే పదం మీద కథ అల్లమని ఓ మిత్రుడు సరదాగా ఛాలెంజ్ చేస్తే వచ్చినదే తెలుగుపాండిత్యం కథ. ధృష్టద్యుమ్నుడు కూడా అలా పుట్టినదే. అన్నీ సరదాకథలేనా. ఓ సీరియస్ కథ వ్రాయమన్న తోటి ఉద్యోగికి ఆశల నిచ్చెన సమాధానంగా వ్రాసాను. పునరపి చలనం స్వయంగా నా అద్దె ఇంటి వేటలోంచి పుట్టిందే. బోనస్ కథలలో - బందరులో కళాశాలాధ్యయనం రోజుల్లో యువసాహితీ వేదిక అనే అ.భా.విద్యాపరిషత్ అనుబంధ సాంస్కృతిక సంస్థ సమావేశాలకు తోడ్కొని వెళ్ళి అస్మత్ కవితా వ్యవసాయాన్ని ఇతోధికంగా ప్రోత్సహించిన సహృదయ స్నేహితుడు కందుకూరి వేంకటేశ్వర్లు వ్రాసిన కథ కాటేయని కరినాగు. అతను మంచి వచన కవి కూడాను. కాని అతగాడు సాహితీ పఠనంలో చూపే శ్రద్ధ సేద్యంలో చూపకపోవటం వలన ఒక మంచి కథా రచయితను, కవిని తెలుగు పఠితలు కోల్పోయారన్నది నా గట్టి నమ్మకం. మీకూ అన్పిస్తుంది. తమ్ముడు శ్రీనివాస్ వ్రాసిన సరదా కథ ఓ ఇంటి భాగోతం.

ఈ కథలను ప్రచురించిన (తృణమో పణమో కొందరిచ్చారు కూడా) అప్పటి ఆ యా పత్రికల సంపాదకులకు, వాటికి చిత్రాలను సమకూర్చిన ఆ యా పత్రికల చిత్రకారులకు మనః పూర్వక నమస్సులను కృతజ్ఞతలను తెలియజేసుకొంటున్నాను.

గత నలభై ఐదేళ్ళ నుంచి వివిధ ప్రముఖ పత్రికలు నిర్వహించిన కథ/నవలల పోటీలలో ప్రథమ లేదా ద్వితీయ, కొండొకచో తృతీయాది పురస్కారాలను అనేకానేకంగా అందుకొన్న బహు సుపరిచిత నవలా మరియు కథా రచయిత శ్రీ కె.వి.ఎల్ ఎన్. ప్రకాశ్ (శ్రీ ఉదయిని). ఈ చిన్న సంకలనం చదివి 'నా మాట' గా స్పందనను అందించిన మిత్రునికి నా కృతజ్ఞతాపూర్వక కైమోడ్పులు.

కవితా ప్రసాద్

రాజమహేంద్రవరము
15.06.2022

# భేతాళుడి (చెప్పని) చివరి కథ



పట్టు వదలని విక్రమార్కుడు చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకొని ఎప్పటిలా ఈ రోజైనా భేతాళుడికి దొరక్కూడదనుకుంటూ మౌనంగా నడవసాగాడు. మామూలుగానే కొంచెం దూరం నడిచిన తర్వాత, శవంలోని భేతాళుడు -

"రాజా! నువ్వు యుగ యుగాల నుంచి పడుతున్న అవస్థ చూస్తుంటే నీ మీద చాలా జాలి వేస్తోంది. మార్గాయాసం తెలీకుండా ఉండేందుకు గాను ఓ కప్పు కాఫీ సేవిద్దువుగాని రా!" అని విక్రమార్కుణ్ణి కొఠీలోని రాజమహల్ హోటల్లోకి లాక్కుపోయాడు.

ఓ పావుగంట సీటు కోసం వెతుక్కుని కూర్చున్న తర్వాత మరో అరగంటకు వచ్చిన సర్వర్‌కు భేతాళుడే రెండు కాఫీలకు ఆర్డరిచ్చాడు. (సారీ! విక్రమార్కుడు

మాటాడకూడదు గదా!) మరో గంటకు సర్వరిచ్చిన కప్పూసాసరు అందుకున్నవాడై విక్రమార్కుడు భేతాళుని వైపు సూటిగా చూశాడు.

"సగం కప్పులోనూ సగం సాసర్‌లోనూ ఉన్న యీ కాఫీలో దేన్ని తాగాలి?" అన్నటుగా ఉందా చూపు. అది గమనించిన భేతాళుడు చిన్నగా నవ్వాడు.

"దేంట్లోది తాగినా ఒకటే" అన్నట్టుగా ఉందా నవ్వు.

అయినా భేతాళుడు కప్పులోదే తాగడం చూసిన విక్రమార్కుడు తాను కూడా కప్పునే పరిగ్రహించి పెదవుల కానించి ఓ సిప్ చేశాడు.

ఉత్తర క్షణంలోనే కాఫీ డికాక్షన్‌లా నల్లగా మాడి(రి)న విక్రమార్కుడి వదనాన్ని చూసి భేతాళుడు సానుభూతిగా "రాజా! ద్రాక్షా సవంలో తేనె కలిపి త్రాగే నువ్వు యీనాడు యిలాంటి కాఫీ త్రాగవలసి రావటం నిజంగా యీ హోటల్ అదృష్టం! ఓ చిన్న సహాయం మాత్రం చేయగలను. కాఫీలో పంచదార ఉందో లేదో తెలీకుండా ఉండగలందులకు ఓ కథ చెప్తాను విను" అంటూ బోరు కొట్టడానికి ఉపక్రమించబోయాడు.

మళ్లీ భేతాళుడికి దొరికిపోతానేమో అన్న తొందరలో కప్పులోని కాఫీతో బాటు సాసరులోది కూడా ఒక్క గుక్కలో తాగేసిన విక్రమార్కుడు భేతాళుణ్ణి ఆగమన్నట్లు సైగ చేశాడు.

ఎప్పుడూ బుద్ధిగా కథ వినే విక్రమార్కుడు యిలా ఆపమనటం ఆశ్చర్యంగా తోచిన భేతాళుడు దాన్నుంచి తేరుకొనే లోగానే విక్రమార్కుడి ఓ చేయి భుజాన ఉన్న సంచీలోంచి ఓ టేప్ రికార్డర్ బయటకు తీయడం, రెండో చేయి దాన్ని 'ఆన్'చేయడం అతివేగంగా జరిగిపోయాయి.

"భేతాళా! నువ్వు చెప్పదల్చుకున్న కథేదో నాకూ తెలుసు! అయినా నువ్వు మర్చిపోకుండా ఉండేందుకు మరోసారి విను, చెప్తాను" అంటూ అందులోంచి విక్రమార్కుని కంఠస్వరం విన్పించ సాగింది.

భేతాళుడు ఓ సిగరెట్ వెల్గించి కుతూహలంగా ఆలకించసాగాడు.

* * *

ఓ పూర్వ కల్పంలోని ఓ మహా యుగంలో హిగిరాజుగారు బ్రేక్ ఫాస్ట్ చేస్తూ ఆకాశవాణి ప్రభాత ప్రసారం ఆలకిస్తున్నారు. హిగిరాజు గారంటే హిమగిరి రాజుగారు! ఆయన భారతదేశంలోని ఉత్తర ప్రాంతంలో ఓ భాగానికి ఆ రోజుల్లో అధిపతి.

"ఆ... కాశవాణి, వార్తలు... చదువుతున్నది విశ్వకర్మ. గత ఐదు రోజులుగా సాగుతున్న క్షీర సముద్ర మథనంలో నేడు ప్రతిష్టంభన ఏర్పడింది. దీనికి కారణం మందర్ శైల్ డ్రిల్లింగ్ మిషన్ బరువు ఎక్కువై లోపలికి కూరుకుపోవటం అని భావిస్తున్నారు. అధికార పక్షం దేవతలు, ప్రతిపక్షం దైత్యులూ ఏర్పాటు చేసుకున్న సమన్వయ బృహత్ ప్రణాళికలో కలిగిన ఈ ప్రతిష్టంభన విశ్వవ్యాప్తంగా తీవ్ర సంచలనం రేపింది. శ్రీ శ్రీమన్నారాయణ్ గారి స్వీయ అధ్యక్షతన ఏర్పాటైన ఏకసభ్య కమిటీ చురుకుగా దర్యాప్తు నిర్వహిస్తోందని ప్రత్యామ్నాయ ఏర్పాట్లు జరుగుతున్నాయని, వైకుంఠం నుంచి మా ప్రత్యేక విలేఖరి శ్రీ నారద్ పంపిన కడపటి వార్తలు సూచిస్తున్నాయి.... సత్యలోకంలో...."

సావధానంగా వార్తలు వింటున్న హిగిరాజుగారు పార్వతి పిలుపుతో ఉలిక్కిపడి తన లోకంలోకి వచ్చారు.

"ఏమిటమ్మాయ్?" అసహనంగా ప్రశ్నించారు.

పార్వతి కొంచెం ముఖం చిన్నబుచ్చుకుని "ఏం లేదు నాన్నారూ! కబురేమైనా తెలిసిందేమోనని?" అడిగిన పార్వతి వదనం చూసి రాజుగారు బోల్డు బాధపడిపోయి –

"నువ్వేం దిగులుపడకమ్మా! అల్లుణ్ణి పండక్కు రప్పించే పూచీ నాది! నిన్ననే తుంబుర్రావు వెళ్తుంటే కబురు పంపించాను కదా! వస్తాళ్ళే!" కూతుర్ని సముదాయించాడు పాపం హిగిరాజుగారు.

ఇంతలోనే ఓ భటుడు వచ్చి నారద్ గారు వచ్చారని చెప్పటం, ఆయన లోపలికి అడుగు పెట్టడం, ఒకేసారి జరిగి పోయినాయి.

"నారాయణ! నారాయణ! బాగున్నారా రాజుగారూ!" అంటూ పరామర్శించిన నారద్ కు ఎదురేగి -

"నమశ్శివాయ! నమశ్శివాయ! దయచేయండి" అంటూ ఉచితాసనం చూపించారు రాజుగారు.

"అమ్మలూ! నారద్ గారికి ఉదయోపాహారం ఏర్పాటు చేయి తల్లీ!" కూతుర్ని ఆదేశించి నారదుల వైపు తిరిగారు రాజుగారు.

"కొంచెం ఆలస్యం అయినా పరవాలేదు!" అనుజ్ఞ ఇచ్చి నారదులవారు -

"రాజు గారూ! తమరు ఏదో పోగొట్టుకున్నట్లు అలా అశాంతిగా కనిపిస్తున్నారు..." ఆగిపోయాడు.

"ఆ! అశాంతిగాక మరేవిటీ ?..." పరధ్యానంగా అని నాలిక్కరుచుకున్నాడు రాజుగారు.

"పరవాలేదు చెప్పండి" అభయమిచ్చి, నారదుల వారు ఉదయోపాహారానికి ఉపక్రమించారు.

"ఆర్చేవాడినా! తీర్చే వాడినా! అని అనుకోకండి! ఏ పుట్టలో ఏ పాము ఉంటుందో? ఏ జర్నలిస్టు దగ్గర ఏ వార్త దొరుకుతుందో!"

"అందుకే నయ్యా నేనూ భయపడేది!" ఆవేదన వెలిబుచ్చాడు రాజుగారు.

"రాజుగారూ! మీకెందుకు! విషయం చెప్పండి చిటికలో తేలుస్తాను!" హామీ ఇచ్చి ఓ గ్లాసుడు మంచినీళ్లు త్రాగాడు నారద్.

"ఇది కూడా ఆ ఆకాశవాణిలోకి ఎక్కించేవు సుమా! కొంప మునుగుతుంది."

"హ హ్హా హ!" చిన్నగా నవ్వి, "అదేమిటి రాజుగారూ! పోయిన సారి మీ చేతుల మీదే కదా ఉత్తమ విలేఖరి బహుమతి ఇచ్చారు నాకు! ఇంకా ఏడాది కూడా కాలేదు. అయినా నా వార్తలు ఎప్పుడన్నా కొంపలు కాల్చాయా?" ఓ మారు చుట్టూ చూసి "పోనీ ముంచాయా?"

"ఇంతకు మునుపు లేదనుకో! కానీ ఇవాళ ఆకాశవాణిలో నీ వార్తలు వింటుంటే కొంప మునిగేట్లే ఉంది!"

"హమ్మయ్య! ఎంత మాట!"

"ఎంత మాట అయితేనేమిట్లే! ఈ బృహత్తర ప్రణాళికకని ఆ శ్రీమన్నారాయణ నా దగ్గర శతకోటి వరహాలు లోను తీసుకున్నాడు తెలుసా?" ఆందోళనతో అన్నాడు హిగిరాజు.

"ఆ!" ఆశ్చర్యంగా నోరు తెరిచాడు నారద్.

"అవును! అసలే మాది పర్వత దేశం. పంటలు పండవు గదా! ఏదో మా రాజ్యంలో నీటి గనులకు కొదవ లేదు కాబట్టి వాటిని ఎగుమతి చేసుకొని ఆహారధాన్యాల్ని దిగుమతి చేసుకుంటున్నాము. ఉహూ! నీకు తెలియనిది ఏముంది! అదీగాక పొరుగున ఉన్న పెద్ద రాజ్యం! అంతర్జాతీయంగా ఎంతో పలుకుబడి ఉన్నవాడు! ఇంకా మా అల్లుడి తరఫున ఏదో చుట్టరికం కూడా ఉంది గదా! ఇవన్నీ దృష్టిలో ఉంచుకుని నేను ఆయన అడిగిన ధనం ఇచ్చాను. అప్పుగానే అనుకో! అప్పయినా క్షణక్షణానికీ మారుతున్న ఈ పరిస్థితుల్లో ధనం పుట్టాలంటే ఎంత అవస్థ గా ఉందో నీకు తెలియనిది ఏముంది? ఎకనామిక్స్ లో పది పుస్తకాలు రాసిన వాడివి! అసలు కుబేరవర్మ గారే మొండిచేయి చూపించార్ట! నాకు తప్పలేదనుకో!..." ఆగారు హిగిరాజా గారు.

"అంతేకాదు! ఏదో ఒడంబడిక ఉందని..." నసిగాడు నారద్.

"హార్నీ! వీడికి ఏం తెలీవనుకున్నాను! అఖండుడు! ఆవులిస్తే ఎన్ని బాటిల్స్ తాగామో చెప్పేట్లున్నాడు" అనుకొని ఆవులించబోయి ఆగిపోయిన హిగిరాజు గారిని నవ్వుతూ చూసాడు నారద్!

మళ్లీ మొదలెట్టాడు రాజుగారు.

"ఒడంబడిక అంటే, వ్రాత కోతల్లో ఏం లేదనుకో! ఏదో లోపాయకారీగా మాటల్లో..."

"అదేమిటీ! మూడు రోజుల రహస్య శిఖరాగ్ర చర్చల్లో వ్రాత పూర్వక ఒప్పందం ఏదో కుదిరిందని ఆ శ్రీమన్నారాయణ్ పీయే విశ్వక్సేన్ చెప్పాడే! "

"అన్నీ తెలుసు వీడికి! పైగా నాటకం! ఎంతైనా జర్నలిస్టు గదా!" లోలోపల అనవసరంగా తను బయట పడినందుకు చింతిస్తూ కోటు బొత్తాములు సర్దుకున్నాడు రాజుగారు.

"ఆ ఏదో చేసుకున్నాం అనుకో! అయినా అన్నీ కాన్ఫిడెన్షియల్ గానే ఉంచమని ఆ నారాయణ్ అంటేనూ..." కాసేపు నీళ్ళు నమిలి

"ఇంతకూ నా భయం ఏమిటంటే?...

చెప్తున్న హిగిరాజు గారిని ఆపి,

"ఆయన ఇతర రాజ్యాల కన్నా మీకు అమృతాన్ని ట్వంటీ పర్సెంట్ తక్కువ రేటుకు సప్లై చేస్తానన్నాడు... ఐ మీన్ హామీ ఇచ్చాడు. అంతే కదా!" అన్నాడు నారద్ ది గ్రేట్ జర్నలిస్ట్ ఆఫ్ ఆకాశవాణి.

"ఎంతైనా వీడు అవతలి పక్షానికి హితుడే! కాకుంటే ఈ విషయాలన్నీ... హమ్మ! హమ్మమ్మా!" లోపల కాసేపు ఆశ్చర్యపడి నారద్ కు కొంచెం దగ్గరగా జరిగాడు.

"ఇంతకూ అసలు సంగతేమిటంటే..."

"ఇప్పుడు పాలసముద్రంలో అమృతం దొరుకుతుందా? దొరకదా? దొరికితే ఎంత? ఈ అగ్రిమెంట్ అమలవుతుందా ? ఇదేగా మీ సందేహం?"

"హు!" తలాడించాడు హిగిరాజు.

"చెప్తాను విను!" బహును ఏకంచేసి "చెప్పేవాడికి అడిగేవాడు లోకువ" ( ఇది దేవలోకంలోని సామెత ) అన్నట్లు ప్రారంభించాడు. అసలు కథ ఏమిటంటే - మన ఎస్. నారాయణ బ్రహ్మచారి కదా! ఆయన్ను, ఆయన త్రిలోక నాయకత్వాన్ని చూసి ముచ్చట పడి పోయి సముద్రం గారు తన కూతురు లక్ష్మి నిచ్చి వివాహం

చేద్దామనుకున్నారు. అయితే అల్లుడికి తగిన కట్నం ఇవ్వాలంటే ఆయనకు స్తోమత లేకపోయింది! అసలే రాజ్యంలో ద్రవ్యోల్బణం ఎక్కువగా ఉంది! అందునా నూటయాభై శాతం లోటు బడ్జెట్! ఇంతలో ఈమధ్య ఆయన దేశంలోని శాస్త్రవేత్తలు సహజ వనరుల కోసం అశ్వనీ దేవతల నాయకత్వంలో అన్వేషణ మొదలుపెట్టారు. అప్పుడే ఈ అమృతం గని బయటపడింది. అయితే దీన్ని అతి కాన్ఫిడెన్షియల్ గా ఉంచి లేబరేటరీలో పరీక్షలు గట్రా చేసి, బుర్రలు పగులగొట్టుకుని ( ఎవరివి వారే ) ఇది చాలా గొప్ప ఔషధ రాజమనీ, సంజీవిని కంటే గొప్పదని, దీన్ని సేవించిన వాడు నిత్య యవ్వనుడు, ఆకలి దప్పులు లేనివా డౌతాడు అని తేల్చారు. కానీ..." క్షణం ఆగాడు నారద్.

"ఆ! ఆ! తరువాత!..." మరికొంచెం జరిగాడు హిగిరాజు -

"కాని దాన్ని వెలికి తీయాలంటే చాలా ఖర్చవుతుంది. భరించే స్తోమత తన ఖజానాకు లేదు. ఆయన ఉన్నత స్థాయిలో చర్చలు జరిపి చివరకు దీన్ని మన శ్రీమన్నారాయణ్ చేతిలో పెట్టాడు. గనిని పూర్తిగా భేదించి అమృతం బయటకు తీసి తనకు సగం ఇచ్చేటట్లు, మిగతా సగంతో తన కుమార్తె శ్రీలక్ష్మి నిచ్చి కట్టబెట్టేట్లు! ఇది దేవ రహస్యం. అయితే దీన్ని మొదట ఒప్పుకోకపోయినా ఆ పిల్ల లక్ష్మీదేవిని- బంగారు తల్లి గదా మరి! చూసేసరికి ఆ నారాయణ్ మనసు మారిపోయి ఇందుకు పూనుకున్నాడు. తన దగ్గరా చాలినంత ధనం లేదు కాబోలు నీ దగ్గరకు..."

"అది సరేనయ్యా! మరీ తనకొచ్చే ఆ సగంలో నాకెంత ఎక్స్పోర్ట్ చేస్తాడు ? ఆ ప్రతిపక్షులను కూడా కలుపుకున్నాడు మరి ?"

"యిది ఇంకో దేవ రహస్యం!..." కాలసూచిక వైపు దృష్టి సారించాడు నారద్.

విషయం గ్రహించిన హిగిరాజు కేకేశాడు. "అమ్మాయ్ పారూ! ఇవ్వాళ నారద్ మన గెస్ట్ గా ఉంటారని చెప్పు అమ్మతో!"

చిరునవ్వు విసిరి నారద్ తిరిగి ప్రారంభించాడు.

"సముద్రం గారితో జరిగిన అగ్రిమెంట్లో ఇంకా చాలా క్లాజులున్నాయ్. అమృతంతో బాటుగా లభించే ఇతర వనరులు ఏమున్నా సరే అవి నారాయణ్‌కే

చెందాలి! వాటిమీద ఆయనకు పూర్తి హక్కు ఉంటుంది. దొరికిన అమృతం శుద్ధి చేయడానికి అయ్యే ఖర్చు సముద్రం గారే భరించేటట్లు...”

“అది సరే...”

“అసలు విషయంలోకి వస్తున్నా! తొందరపడకండి! ఈ అగ్రిమెంట్ లోని నిబంధనలన్నీ ఏకపక్షంగా మార్చే అధికారం కూడా శ్రీమన్నారాయణ్ చేతిలోనే ఉంది మరి! కాబట్టి మీకేం భయం లేదు. మీకు రావాల్సిన భాగం వస్తుంది.”

“ఎంత రాజకీయం!!!” నోరు తెర్చుకున్నాడు హిగిరాజు. అన్నాడే కానీ శ్రీమన్నారాయణ్ రాజకీయం అర్థమయ్యేసరికి హిగిరాజు గారికి చాలా టైం పట్టింది. అది ఎలాగంటే -

అత్తవారింటికి సంక్రాంతికి వచ్చిన అల్లుడు పశుపతికి అమాంతం జబ్బు చేసింది. ఏమిటంటే మరేమీ లేదు. ఒళ్లంతా తిమ్మిర్లు ఎక్కడం! విపరీతంగా వణకడం! రాజ వైద్యులు ఎంత వైద్యం చేసినా అది తగ్గలేదు. వాళ్లంతా చేతులు కట్టేసుకొన్నారు. అన్నట్లు ఇక్కడో విషయం చెప్పాలి. ఈ పశుపతికి ఆ శ్రీమన్నారాయణ్ ప్రాణ మిత్రుడు. బాహ్య శరీరాలు వేరే కానీ అంతరంగాలొకటే అని అంటారు ఎరిగిన వాళ్ళు. అందువల్ల శ్రీమన్నారాయణ్‌కు టెలిగ్రాం కబురంపించాడు హిగిరాజు!

ఈ అర్జంట్ టెలిగ్రామ్ అందేసరికి ఆ నారాయణ్ పెద్ద డైలమాలో ఉన్నాడు. మందర్ శైల్ లోపలికి దిగబడిం తర్వాత కూర్మ యంత్రం రూపొందించి దాని సాయంతో మళ్లీ డ్రిల్లింగ్ మొదలు పెట్టించాడు నారాయణ్. అప్పుడు ఒక వింత జరిగింది.

క్షీర సముద్రంలో వివిధ రకాలైన నాచురల్ ప్రొడక్ట్స్ నిచ్చే కల్పతరు జాతి మొక్కలు బయటపడ్డాయి. వాటన్నింటిని బయటకు చేరవేయించి స్వర్గంలోకి తరలించాడు. ఆ తర్వాత కామధేను జాతి జీవుల్ని బయటకు తోలించాడు. (ఇవి ఒక రకమైన జంతువుల్లాంటివి, మన లవణ సముద్రాల్లో తిమింగలాల్లా! ఈ జాతి

క్షీరదాల స్తన్యం వల్లనే క్షీర సముద్రం ఏర్పడిందని ప్రతిపాదించి సముద్రం గారి అబ్బాయి చంద్రుడు ఆ తర్వాత డాక్టరేట్ పుచ్చుకున్నాడు.)

ఇక అమృతం వస్తుంది అనుకుంటున్న చివరి క్షణాల్లో ఊహించరాని అద్భుతం జరిగింది. శతసహస్రార్క ప్రభా భాసమాన మైన కాంతితో విపరీతమైన హీట్ రేడియేట్ చేస్తూ ఓ రకమైన గ్యాస్ బయటకు విరజిమ్మింది. డ్రిల్లింగ్ చేసేవాళ్ళు ప్రభుత్వం ప్లస్ ప్రతిపక్షంలో చావగా మిగిలిన వాళ్ళు నారాయణ్ దగ్గరకు పోయి ఆ వైకుంఠనాథునికి విషయం వివరించారు. ఆయన వెంటనే అశ్వినీ దేవతల సారథ్యంలో ఓ కమిటీని రూపొందించగా వాళ్ళు దాన్ని పట్టి ప్లాటినం సిలిండర్లలో బంధించి ఎనలైజ్ చేసి రిపోర్టు సమర్పించారు. అక్కడ డ్రిల్లింగ్ కొనసాగుతోంది. ఇక్కడ నారాయణ్ ఆ రిపోర్టు చేత్తో పుచ్చుకుని కూర్చున్నాడు.

"ఇది అత్యంత ప్రమాదకరమైన గరళం అనబడే పదార్థం. అత్యంత శీతలం కమ్మి మరణావస్థలో నున్న వాళ్లకు మాత్రం సంజీవినిలా పనిచేస్తుంది. (ఆరోగ్యవంతుణ్ణి ఠపీమని చంపుతుంది.) అయితే ఒక్కొక్కప్పుడు రోగికి స్వల్పంగా ఉన్మాద లక్షణాలు కనిపించవచ్చు."

సరిగ్గా ఆ సమయంలోనే హిగిరాజు గారు కొట్టించిన టెలిగ్రాం వచ్చింది. క్షణం ఆలోచించిన నారాయణ్ అశ్వినీ దేవతలను గరళాన్ని వెంట పెట్టుకుని "గరుడ్" జెట్ విమానంలో హిగి రాజ్యం చేరుకున్నాడు. వెంటనే ఈ గరళాన్ని క్షీరంతోనూ మధువుతోనూ కలిపి పూర్తిగా ఎక్కించేశారు పశుపతికి! అతడు నెమ్మదిగా కళ్ళు తెరిచి చూశాడు. పార్వతి కళ్ల నుంచి ఆనందబాష్పాలు రాలాయి.

హిగిరాజు గారు అశ్వినీ దేవతల వైపు చూశాడు, అయోమయంగా! వారిట్లా చెప్పారు.

"అలవాటు లేని హిమాలయ వాతావరణం వల్ల మీ అల్లుడు గారికి అతిశీతం కమ్మింది. అతనికి ఇప్పుడే మార్కెట్లోకి వచ్చిన ఈ కొత్త మెడిసిన్ ఎక్కించ గా బ్రతికి బయటపడ్డాడు. డోంట్ వర్రీ! మీరేం విచారించకండి."

అప్పుడే అక్కడకు వచ్చిన నారద్ అన్నాడు. "స్వామీ! మాకు కూడా ఇలాంటి బాధ ఎప్పుడైనా రావచ్చు! అందులోనూ నేను అనేక లోకాలు తిరుగుతూ ఉంటాను. ఒంటరి వాడిని! తరణోపాయం సెలవివ్వండి."

నారాయణ్ చిరునవ్వు నవ్వి, "ఇందాక మేము వస్తున్నప్పుడు సిలిండర్ లీక్ అయి ఈ గరళంలో కొంత భాగం భూలోకంలో పడిపోయింది. ఆ ప్రాంతాల్లో కొన్ని మొక్కలు మొలుస్తాయి. వాటిని కాఫీ మొక్కలు అంటారు. వాటి గింజల్లో మీకు సరిపోయే ప్రమాణంలో ఈ గరళం లభ్యమౌతుంది. దాన్ని క్షీరంతోనూ మధువుతోనూ కలిపి సేవించండి. రోజూ ఓ కప్పు తాగి, ఈ కథ చెప్పుకొన్న వాళ్లకు ఎలాంటి భయం లేదు" అన్నాడు.

"తథాస్తు" అన్నారు అంతా!

ఆ తర్వాత చాలా వింతలు జరిగాయి. పశుపతి గారు బాగుపడిన సందర్భంలో హిగిరాజు గారు కొత్త పంచెల జత పెట్టారు. ఆయన అవి మూలకు గిరాటేసి గోడ నున్న పులి చర్మం కట్టుకున్నారు.

'స్నోలు, పౌడర్లు' పక్కకు తోసేసి విభూతి పూసుకున్నారు. బంగారు పళ్లెంలో భోజనం పెడితే వద్దని...

మొత్తానికి కొన్ని ఉన్మాద లక్షణాలు అంకురించాయని హిగిరాజు గారు గ్రహించి, తెగ విచారించి, అల్లుణ్ణి తన దగ్గరే అట్టి పెట్టుకున్నారు శాశ్వతంగా.

ఆ తర్వాత అమృతం దొరికింది. శ్రీమన్నారాయణ్ లక్ష్మీనాథుడై మామగారి రాజ్యం కూడా తానే పాలించడం మొదలు పెట్టాడు అక్కడే ఉండి!

హిగిరాజు గారు నేటికీ తన వాటా కోసం కబురు పెడుతూనే ఉన్నారు.

"ఇదే కదా! నువ్వు చెప్పదలుచుకున్న కాఫీ(పీ) కథ" అన్నట్టు విక్రమార్కుడు భేతాళుని వైపు చూసి తల పంకించాడు.

భేతాళునికి వెంటనే ఓ ధర్మ సందేహం వచ్చింది. "తాను ధర్మ విజితుడా? అధర్మ విజితుడా?"

వెంటనే ఓ దీర్ఘ నిశ్వాసం విడిచి, "రాజా! కథ నువ్వు చెప్పినా, నే చెప్పినా పాఠకులు పెద్ద బాధపడరు. కానీ ప్రశ్న వేసే హక్కు మాత్రం నీకిస్తే వాళ్లు నన్ను క్షమించరు. ఇంతకూ ఇది చెప్పు. నేను ఈరోజు ఈ కథ చెప్పబోతున్నానని నీకు ఎలా తెలుసు? తెలిసి చెప్పకపోయావో ఏం జరుగుతుందో నీకు తెలుసు కదా!" అన్నాడు భేతాళుడు. వెంటనే విక్రమార్కుడు రికార్డర్ ను మళ్లీ సంచిలో వేసుకుంటూ - గర్వంగా...

"అసలు సంగతి ఏమిటంటే..." అని ప్రారంభించాడో లేదో భేతాళుడు అమందానందసందోహ కందళితాంతరంగుడై,

"రాజా! మౌనభంగము... మౌనభంగము" అంటూ సుశీలలా పాడుకుంటూ గెంతబోయాడు.

విక్రమార్కుడు ఓ క్షణం తెల్లబోయినా వెంటనే తమాయించుకుని ఆ హోటల్ దద్దరిల్లేటట్లు నవ్వసాగాడు.

ఆ నవ్వును చూసి కంగారు పడిన భేతాళుడు గెంతటం ఆపి, "ఏం?" అన్నట్లు చూశాడు భ్రుకుటి వైచి

విక్రమార్కుడు తాపీగా ఓ గ్లాసు 'ఫ్రిడ్జ్'వాటర్ తాగి భేతాళునితో

"ఇంకెక్కడికి పోతావ్ ? నువ్వు రోజూ నాకు కథలు వినిపించి పారిపోయి ఎక్కుతావు చూడూ, ఆ చెట్టును భట్టి చేత కొట్టించేశాను. ఈ సరికి వేళ్ళతో సహా మొత్తం కూల్చివేయబడి ఉంటుంది. ఇంక నా వెంట రాక నువ్వు చేసేది ఏమీ లేదు. ఈ హైదరాబాదులో అద్దె కొంపలు కూడా దొరకవు నీకు" అంటూ బిక్క మొగం వేసిన భేతాళుణ్ణి భుజాన వేసుకుని ఒక్క ఉదుటున బిల్లు చెల్లించి బయటకు వచ్చాడు.



("ఆంధ్రసచిత్ర వారపత్రిక" 18.06.1982 సంచికలో)

అది అతని మొదటి రాత్రి. మనోరంజకంగా అలంకరించబడిన శోభనపు గదిలోకి నవ మన్మథుల్లా ప్రవేశించిన కామేశం ఒక్కసారి గదినంతా కలియ చూసాడు. లేత నీలం రంగు విద్యుత్కాంతి లో ఆ గది గోడలు మెరిసిపోతున్నాయి. పందిరి మంచానికి పైనుంచి సన్నజాజులు మల్లెపూల దండలు వేలాడుతున్నాయి.




గది గోడలకు అందమైన పెయింటింగులు అలంకరించబడ్డాయి. మంచానికి తలగడ దిక్కున రక రకాల పళ్ళు, తినుబండారాలు చక్కగా అమర్చబడి ఉన్నాయి. ఓ పక్కగా స్టాండ్‌లో అగరువత్తులు మనోహరమైన పరిమళాన్ని వెదజల్లుతున్నాయి. జాజుల మల్లెపూల గుబాళింపులు అగరువత్తుల సుగంధ వీచికలతో కలిసి గుండె లోపలి అరల్లో సున్నితమైన అలజడిని కలిగిస్తున్నాయి. ఆ వాతావరణం అతనికి

వింతగానూ, కొత్తగాను ఉండి ఆనందాన్ని ఆహ్లాదాన్ని కలిగిస్తోంది. నెమ్మదిగా ముందుకు నడిచి స్వచ్ఛంగా తెల్లగా ఉన్న మెత్తని పడకపై సగం మేను వాల్చి తలగడ కానుకుని కూర్చున్నాడు.

కామేశం తెలుగు లెక్చరరు. సహజంగానే ఆ సమయంలో అతను చదివిన కావ్యాలలోని ప్రబంధాలలోని మధురమైన సన్నివేశాలు అతనికి జ్ఞాపకం వచ్చి ఒళ్ళు పులకరించి నట్లయింది. అంతలో అతనికి లక్ష్మి జ్ఞాపకం వచ్చింది. ఆమెతో కాలేజీలో తన మొదటి పరిచయం, ఆ సంఘటనలు అతడి కళ్ళముందు కదలాడాయి.

కామేశం ఈ మధ్యే లెక్చరరుగా కొత్తగా ఉద్యోగంలో ప్రవేశించాడు. చేరిన కొత్తలోనే, ఒక నెల కూడా కాలేదు బహుశా, ఒకరోజు ప్రిన్సిపాల్ అభ్యర్థన మేరకు ఫైనల్ వాళ్ల స్పెషల్ తెలుగు క్లాసుకు వెళ్లాల్సి వచ్చింది. సాధారణంగా కొత్తగా వచ్చిన లెక్చరర్లకు ఫైనలియర్ క్లాసులు ఎలాట్ చేయరు. నిజానికది తెలుగు హెడ్ సుబ్బారాయుడు గారి క్లాసు, కానీ ఆయన ఆ రోజు సెలవు. మిగతా స్టాఫ్ అందరకూ వాళ్ల వాళ్ల క్లాసులున్నాయి. అందువలన ఆ క్లాసు కామేశం పాలబడింది. అయితే అది అంతా ఆడపిల్లలే ఉన్న సెక్షన్. ఆడపిల్లలకూ కామేశానికీ కొంచెం దూరం. యూనివర్సిటీలో చదివాడు అన్న మాటే గానీ అతనికి ఆడపిల్లలతో ఏమాత్రం పరిచయాలు కలగలేదు. కలిగించుకోలేదంటేనే బాగుంటుంది. మొత్తం మీద జంకుతూనే క్లాసుకు వెళ్ళాడు. అయితే క్లాసు లో అడుగు పెట్టిన తర్వాత కొంచెం ధైర్యం పుంజుకున్నాడు. ఉన్నది ముగ్గురే ముగ్గురు అమ్మాయిలు. ఆరోజు చెప్పాల్సింది వరూధినీ ప్రవర సంవాదం. కొంచెం ఇబ్బందిగా ఫీల్ అయినా మొత్తం మీద బయటపడకుండా గంభీరంగా పాఠం ప్రారంభించాడు. హమ్మయ్య పరవాలేదు అనుకుంటూ ఉండగా ఒక్కసారిగా అమ్మాయిలు ఫక్కున నవ్వడం వినిపించగానే ఉలిక్కిపడ్డాడు. పాఠం ఆపి సీరియస్ గా చూసాడు వాళ్ల వంక.

“ఎందుకు నవ్వుతున్నారు ?” అతని ప్రశ్నతో వాళ్ల నవ్వులు వెలిశాయి.

"అడగవే!" మోచేత్తో పొడుస్తూ అటూ ఇటూ ఉన్న అమ్మాయిలు మధ్యనున్న అమ్మాయికి సైగ చేశారు.

ఆ అమ్మాయి ఓ మారు వాళ్ల వంక మరోమారు కామేశం వంక చూస్తూ లేచి నిలబడి

"సార్! ఆ గోడ దగ్గర బెంచీ మీద కూర్చో మంటారా మమ్మల్ని!" అని గభాల్న కూర్చుంది.

కామేశానికి అర్థం అయ్యింది. అతని ముఖం వివర్ణమయింది. తను ఆడపిల్లల వంక చూస్తూ పాఠం చెప్తే సభ్యతగా ఉండదని అనుకుని ఎదురుగా గోడ వైపు చూస్తూ పాఠం చెబుతున్నాడు. వీళ్ళతో ఇక లాభం లేదనుకుని ఈసారి వాళ్ల ముఖాలవంకే చూస్తూ చెప్పటం మొదలుపెట్టాడు. కానీ మళ్లీ మరో ఇబ్బంది వచ్చిపడింది. ఆ మధ్యన ఉన్న అమ్మాయి ఎంతసేపు అతని కళ్ళల్లోకే చూస్తూ కూర్చుంది. పాఠం వింటోందో లేదో కూడా తెలియటం లేదు.

నిజానికి కామేశం చక్కటి అందగాడు. దబ్బపండు ఛాయలో మగసిరి ఉట్టి పడుతూ ప్రబంధనాయకుల్లా ఉంటాడు. అంచేత అతని ముఖం చూడటంలో ఆడ పిల్లల తప్పులేదు. కానీ అలా కళ్ళల్లో కళ్ళు పెట్టినట్లు తీక్షణంగా ఏదో వెతుకుతూన్నట్లు చూడటం, చూస్తూ మాట్లాడటం అతనికి చచ్చే ఇబ్బందిగా ఉంది. ఆ అమ్మాయి ధైర్యానికి నిస్సంకోచానికి విస్తుపోయాడు కూడాను.

అప్పుడతడు "పాటున కింతు లోర్తురె కృపారహితాత్మక..." అన్న పద్యానికి వ్యాఖ్యానం చెప్తున్నాడు.

"సార్!" ఓ పక్కన ఉన్న అమ్మాయి అడిగింది "పాటు అంటే ఏమిటి సార్?"

"భంగపాటు" అన్నాడు కామేశం భయం భయం గానే.

"కాదేమోసార్!" ఠక్కున అంది మధ్యనున్న అమ్మాయి.

"మరేమిటి?"

"రెప్పపాటు కాకూడదా సర్!"

"రెప్పపాటా? ఎలా?"

"రెప్పపాటు అంటే కళ్ళు మూసుకోవడం గదా!"

"అయితే!"

"ఏముంది సార్! వరూధిని చాలా అందగత్తె. తనను కౌగలించుకోబోయేసరికి ప్రవరుడు కళ్ళు మూసుకుని ఆమెను తోసాడు. అంతటి తన అందాన్ని చూడకుండా కళ్ళు మూసుకోవడం అంటే వరూధినిని కించపరచడమే గదా! అలా కళ్ళు మూసుకోవడాన్నే బహుశా వరూధిని భరించలేక అలా అని ఉంటుందని అనుకోవచ్చు కదా!"

కామేశానికి నోట్లోంచి మాట రాలేదు. ఉక్రోషం, ఆవేశం కలగాపులగంగా ఉవ్వెత్తున లేచాయి. ఇంతలో బెల్లయింది. గభాలున పుస్తకాలు తీసుకుని బయటకు వచ్చేశాడు. కానీ అప్పుడు ఆమె ఎర్రని చిగురాకు పెదవుల మధ్య బిగించిన నవ్వు, కళ్ళలోంచి ఉరుకుతున్న కొంటెతనం తనకు ఈ నాటికీ బాగా గుర్తు.

ఆ తర్వాత ఆమె చేసిన అల్లరిని కామేశం హెడ్ సుబ్బారాయుడు గారితో చెప్పాడు. ఆయన తన్మయత్వంతో కన్నులు మూసుకొని

"ఆహా! ఏం చెప్పిందోయ్! అదీ రసజ్ఞత అంటే! నీకు తెలీదోయ్. ఆ పిల్ల మంచి కవయిత్రి, రసజ్ఞురాలు! అలాంటి వాళ్లకు పాఠం చెప్పటం నిజంగా అదృష్టమోయ్! అందుకే గదుటోయ్! కవి ఏ మెరుగు రసజ్ఞుడెరుగు అన్నారు!" అంటూ ఏదేదో చెప్పాడాయన.

"ఈ ముసలాడికి ప్రతి దాంట్లోనూ రసమే కనిపిస్తుంది." అని గొంతు వరకూ వచ్చిన కోపాన్ని దిగమ్రింగి మనసులోనే తిట్టుకున్నాడాయన్ను.

ఆ తర్వాత మధ్య అమ్మాయి లక్ష్మి వాళ్ల నాన్న తమ ఇంటికి రావడం, తమ కుటుంబంతో ఆయన పాత స్నేహాన్ని నెమరు వేసుకోవడం, ఆ అనుబంధాన్ని బంధుత్వంగా మార్చుకోవాలి అనుకోవడంతో లక్ష్మి తన అర్ధాంగి కావటం అంతా అతనికి సినిమా కథలా జరిగినట్లు అనిపించింది.

ఆలోచన నుంచి తేరుకుని కామేశం గది గుమ్మం వైపు చూశాడు. అవేమీ తెరుచుకుంటున్న జాడలు లేవు. అతని దృష్టి గోడ మీది శృంగార శాకుంతలం పెయింటింగ్ మీద పడింది. ఆ బొమ్మ ఎంత అందంగా చిత్రించబడింది! దుష్యంతుడి ముఖంలో ప్రణయోద్వేగం, శకుంతలలో తత్తరపాటు చాలా అద్భుతంగా ప్రతిఫలిస్తున్నాయి. దాన్ని అలా చూస్తుంటే అతనిలో అనేక శృంగార భావాలు అంకురించసాగాయి. పఠించిన తెలుగు ప్రబంధ సాహిత్యం అంతా అతనిని ఆవరించ సాగింది. ఆమె... తన కౌగిలిలో వాలినప్పుడు... తను ఆమె సిగ్గులొలుకుతున్న ముఖంలో ముఖం ఉంచి... రెండు చేతులతో ఆమె నునుపైన కపోలాలను మృదువుగా స్పృశిస్తూ... తాంబూలంతో అరుణిమ పండిన ఆమె పెదవుల మీద... మెత్తగా... తియ్యగా... ముద్దు పెట్టుకుంటే! హృదయంలో భావాలు ఉక్కిరి బిక్కిరి చేస్తుంటే, అతనికి ఒక్కసారిగా ఒళ్ళు పులకరించింది. హఠాత్తుగా చిన్నప్పటి సంఘటన జ్ఞాపకం వచ్చిందతనికి.

తనకప్పుడు పధ్నాలుగేళ్ళు ఉంటాయేమో! తొమ్మిదవ తరగతి చదువుతున్నాడు. తాముండేది కొంచెం పల్లెటూరు. తమ ఇంటికి ఎదురుగా చిన్న అడవిలాంటి ప్రదేశం ఉండేది. దాన్నందరూ రాజా గారి దివాణం అని పిలిచేవారు. ఏవో రెండు పాడుబడిన ఇళ్ళు తప్ప మిగతా స్థలం అంతా చెట్లూ, తుప్పలూను. చుట్టూ గోడ అంతా శిథిలమై పోయింది. ఈత, తుమ్మ, వెలగ, కొబ్బరి చెట్లు విపరీతంగా ఉండేవి. వాటితో పాటు నిలువెత్తు ముళ్ళ కంపలు నిండి ఉండేవి. అందులో తిరుగుతుంటే నిజంగా ఒక మహారణ్యం మధ్య ఉన్నట్లు ఉండేది. అంత పెద్ద దివాణానికి ఓ కాపలాదారు ఉండేవాడు నాగయ్య అని. వాడికి పెద్ద పెద్ద మీసాలు ఉండేవి.

భారీ శరీరం. చూడ్డానికే మహా భయంకరంగా ఉండేవాడు. చిన్న పురుగును కూడా లోపలికి రానిచ్చేవాడు కాదు. అయినా ఎలాగోలా అతని కళ్ళు కప్పి తనూ, తన మిత్ర బృందం అందులో యథేచ్ఛగా విహరిస్తూ ఉండేవాళ్ళు. ముఖ్యంగా సంక్రాంతి రోజుల్లో ఆ దివాణంతో తనకి చాలా పని బడేది! ఇంకా భోగి పండుగ నెల పైగా ఉందనగానే తనూ, స్నేహితులూ కలిసి ఆ దివాణంలో ఓ

మూలగా ఉన్న ఈత చెట్టుని ఎలాగోలా కష్టపడి కూల్చేవాళ్ళు. అది నెల రోజుల్లోనూ బాగా ఎండేది. ఇంకా ముళ్ళ కంపలు, చిన్న చిన్న కొమ్మలూ చాలా వాటిని ఏరి ఓ చోట భద్రంగా దాచే వాళ్ళు. భోగి రోజుకు వాటన్నింటిని తమ ఇంటి ముందు పేర్చి పెద్ద మంట వేసే వాళ్ళు.

అప్పుడు రాఘవరావు గారు తమ ఇంటి పక్కనే ఉండే వాళ్ళు. వాళ్ళ అమ్మాయి సుబ్బలక్ష్మి. అంతా సుబ్బులు అని పిలిచేవాళ్ళు. సుబ్బులు తనకన్నా మూడునాలుగేళ్ల చిన్నది. బంధుత్వం ఏమీ లేకపోయినా వాళ్లూ, తామూ ఏవో వరసల్లో అభిమానంగా పిలుచుకునే వాళ్ళు. తను, సుబ్బులు వాళ్ల నాన్నను మావయ్య అని పిలిచేవాడు. సుబ్బులు తనని బావ అని పిలిచేది. చక్రాల్లాంటి కళ్ళతో బొద్దుగా ముద్దుగా ఉండే సుబ్బులుకి వాళ్లింట్లోనూ తమ ఇంట్లోనూ గారాబంగానే జరుగుతూండేది. ముఖ్యంగా ధనుర్మాసంలో సుబ్బులు పెట్టే గొబ్బిళ్ళకు పూలు సంపాదించి పెట్టడం తన డ్యూటీ. దివాణంలో ముళ్ళ గోరింట పొదలు విపరీతంగా ఉండేవి. రోజూ పొద్దున్నే పోయి వాటిని కోసుకొచ్చేవాడు. ఆ వంకతో తన భోగిమంటకు కావలసిన సరంజామా అంతా ఓ చోట పోగేసేవాడు కూడా!

మామూలుగానే ఆ ఏడు కూడా భోగి పండగ వచ్చింది. తనకు సహజంగానే భోగిమంటల సరదా ఎక్కువ. ఆరోజున ప్రతి సంవత్సరం కంటే పెద్ద భోగిమంట వేయాలని ప్రయత్నం. అలాగే వేసారు కూడాను. దాంతో ఉత్సాహం పెచ్చు పెరిగి పోయింది. అప్పటికి బాగా తెల్లారి పోయింది. కొంచెం ఎండపొడ వచ్చింది కూడా. అయినా తనకు ఉత్సాహం తగ్గలేదు. మంట చిన్నది అవుతూ ఉండటం చూసి ఏదైనా కంప పట్టుకొద్దామని తను పిల్లిలా రహస్యంగా దివాణంలోకి దూరాడు. మామూలుగా ఓ పక్కగా వెళితే ఏ గొడవా ఉండేది కాదు. కానీ అక్కడ రాజా గారి గడ్డివాము దాని మధ్యగా జనుము కట్టలు కనిపించగానే తనకొక చిలిపి ఆలోచన వచ్చింది. నిమ్మదిగా రెండు జనపకట్టలను వాములోంచి లాగడం మొదలుపెట్టాడు. కానీ ఎలా చూశాడో కాపలాదారు పెద్దగా అరిచి పట్టుకో... పట్టుకో అంటూ తనవైపు పరుగెత్తుకు వస్తున్నాడు.

అంతే! తను ఆ కట్టలు అక్కడే వదిలేసి కాలి సత్తువ కొద్దీ పరుగెత్తి సగం పడిన గోడ మీంచి ఒక్క దూకు దూకి బయటపడ్డాడు. కానీ వాడు తననొదల్లేదు. అసలే తన మీద వాడికి చాలా రోజుల నుంచి గుర్రుగా ఉంది. ఆ హడావిడిలో గబగబా ఎదురుగా కనిపించిన తలుపు తోసుకుని లోపలికి వెళ్లి నెమ్మదిగా గడియ పెట్టేశాడు. అది రాఘవయ్య గారి ఇంటికీ ప్రహరీకి మధ్యగా ఉన్న చిన్న సందు లాంటిది. దాని తలుపు గడియ సాధారణంగా వేసే ఉంటుంది. ఎందుకంటే దాన్ని వాళ్ళు స్నానాల గది కింద ఉపయోగిస్తారు. ఎందువల్లనో అదృష్టం కొద్దీ అది అప్పుడు తీసి ఉంది.

"హమ్మయ్య!" అనుకొని కళ్ళు మూసుకుని పది క్షణాలు ఆయాసం తీర్చుకుని వెనక్కు తిరిగాడు. అంతే! తన ఒళ్ళంతా ఒక్కసారిగా ఎడ్రినలిన్ వ్యాపించినట్లు అయింది. తను అంతవరకూ ఎరగని ఒక కొత్త దృశ్యం!

సుబ్బులు తనవైపు వీపు పెట్టి అవతల వైపుగా వంగి ఏదో చేస్తోంది. ఒంటిమీద నూలుపోగు లేదు. తెల్లటి ఒంటి మీద నీరెండ పడి వింతగా మెరుస్తోంది. విచ్చుకోబోతున్న పుష్పం, ఉప్పొంగబోతున్న యవ్వనం, కంటికెదురుగా అలా ఉన్న సుబ్బుల్ని చూసేసరికి తనలో ఏదో మైకం ప్రవేశించినట్లు అయింది. ఏదో... ఏదో అనుభూతి! ఆరాటం! తపన! ఏదో చేయాలి. ఏమిటో సరిగ్గా తెలియని వయసు. నెమ్మదిగా వెనగ్గా వెళ్లి గభాల్న సుబ్బులు శరీరం చుట్టూ రెండు చేతులూ బిగించి తన వైపుకు తిప్పుకున్నాడు. సుబ్బులు గింజుకోబోతుంటే ఎర్రగా ఉన్న ఆమె పెదవుల మీద గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు. ఎంత తియ్యగా ఉంది! ఏదో మత్తు! పారవశ్యం! ఇంతలోనే లోపల్నుంచి 'సుబ్బులూ'అని వాళ్ళ అమ్మ కేక వినిపించగానే తనను గట్టిగా తోసేసి లోపలికి పరుగెత్తింది. తను వణుకుతున్న శరీరంతో, అదిరే గుండెలతో మెల్లగా గడియ తీసుకుని బయటకు వచ్చేశాడు.

ఇంట్లో కొచ్చేసిన ఓ అరగంటకు స్తిమిత పడిన తర్వాత తనకు ఏదో భయం వేసింది. సుబ్బులు వాళ్ళింట్లో తన గురించి ఏమి చెప్పిందో ? ఆ రోజల్లా తను భయపడుతూనే ఉన్నాడు. దేవుడికి వెయ్యి దండాలు పెట్టుకున్నాడు. భోగిమంటల సంబరం అంతా ఆవిరైపోయింది. చివరకు తను ఆందోళన పడినట్లు ఏమీ జరగలేదు. కానీ సుబ్బులు తనతో మాట్లాడటం, తనకు కనిపించడం మానేసింది. ఆ

తరువాత కొద్ది రోజులకే ట్రాన్స్ఫర్ మూలంగా వాళ్లు మా ఊరు విడిచి పెట్టేశారు. ఆ తర్వాత కొన్ని రోజులకే నాన్న హఠాత్తుగా పోవడంతో తనూ అమ్మా కూడా ఆ ఊరు వదిలేసి మావయ్య దగ్గరకు వెళ్ళిపోయారు. కానీ ఆ తీయటి తొలిముద్దు, దాని తాలూకు అనుభూతి తనను అంటి పెట్టుకుని ఉన్నాయి. ఇంకా తన స్మృతిలో మెదిలి అల్లరి పెడుతూనే ఉన్నాయి. అయినా దాంతో పాటు ఏదో వెలితి!

అలికిడి అయ్యేసరికి ఆలోచనలు చెదరి కళ్ళు తెరిచాడు కామేశం. మూసిన తలుపుల దగ్గర ఆమె! రెండు చేతులు పొత్తికడుపు దగ్గరగా, చేతుల మధ్య పాలగ్లాసుతో అపరంజి బొమ్మలా, తాను చదివిన శృంగార నాయకీమణుల విలాసాలన్నీ కలబోసిన విధంగా వయ్యారంగా నిలబడి ఉంది. తన శృంగార రసాధిదేవత! అనిమిషత్వంతో ఆమెని చూస్తున్నాడు కామేశం. పచ్చటి పసిమి ఛాయ, తీరైన అవయవ సౌందర్యం. పొందికగా కట్టిన తెల్లని చీర, తెల్లటి బ్లౌజ్, రెండు చేతులకు నిండుగా గాజులు. శ్రీకారం లాంటి చెవులకు కొంచెం పెద్ద రింగులు, క్రావడి లాగా! ఒక్క పిసరు పెద్దదిగా ఉందనిపించే నాసికకు ఒకపక్క మూడురాళ్ల తెల్లటి ముక్కుపుడక. దాని జిగిని మించిన కళ్ల మెరుపు, వంటి నునుపు. సమమైన నుదురు మధ్యగా ఎఱ్ఱటి కళ్యాణ తిలకం, దీటైన జడ, తెల్లని జాజులు, చెక్కిలిపై చిన్న చుక్క. యవ్వనాన్ని, సౌందర్యాన్ని రంగరించి, ఆభరణాలు అలంకరించి, దుస్తులు తొడిగి నిలబెట్టినట్టుగా ఉంది ఆమె ముగ్ధ సౌందర్యం.

తలవంచి నెమ్మదిగా అడుగులో అడుగు వేసుకుంటూ తన దగ్గరగా వచ్చి చేయి చాచింది పాలగ్లాసుతో. నవ్వు వచ్చింది కామేశానికి. ఆ రోజు క్లాసులో తనను అల్లరి పెట్టిన లక్ష్మేనా! మృదువుగా పాల గ్లాసు తీసి పక్కన పెట్టి ఆమెను తన మీదికి లాక్కుంటూ ఆమె చెవిలో ఏదో గుసగుసలాడాడు.

అతని కౌగిలిలో వాలిపోయిన ఆమె అన్నది సిగ్గు దొంతరలతో "ఇప్పుడు నేను లక్ష్మిని కాను! నీ సుబ్బులేన్నే!"

ఆనంద పారవశ్యంతో "సుబ్బులూ!" అంటూ తమకంగా ఆమె చుబుకాన్ని ఎత్తి గాఢంగా ఆమె అధరాన్ని చుంబించాడు.

సుబ్బలక్ష్మి కళ్ళు అరమోడ్పులయ్యాయి వివశత్వంతో.

హఠాత్తుగా అతని చేతులు ఆమె చెంపల్ని వదిలేశాయి. నివ్వెరపోతూ అతని వంక చూసింది సుబ్బలక్ష్మి.

"ఏమయింది?" అతని భుజాల మీద చేతులేసి సంకోచంగా అడిగింది.

"అర్థం కావటం లేదు!" గొణిగినట్లుగా అన్నాడు.

"ఏమిటి ?" ఆందోళనగా అడిగిందామె తరచి తరచి.

చివరకి "తి...య్యగా...లే...దు?" కూడబలుక్కుని అంటున్నట్లుగా అన్నాడు. అర్థం కాక అయోమయంగా చూసింది అతని వంక.

"ఏం తియ్యగా లేదు?"

"అదే! ఇప్పుడు" కొంచెం సిగ్గు పడ్డట్లు ఆగాడు. ఎలాగైతేనేమి లాలించి, బుజ్జగించి చివరకు అసలు సంగతి రాబట్టింది లక్ష్మి ఉరఫ్ సుబ్బులు. అంతే! ఫకాలుమని నవ్వసాగింది, తెరలు తెరలుగా! అలలు అలలుగా! మనోహరంగా!

మతిపోయినవాడిలా తన వంక కళ్లప్పగించి చూస్తూ ఉండిపోయిన కామేశాన్ని చూసి అతి కష్టం మీద నవ్వాపి చెప్పింది సుబ్బులు -

"నాకు చిన్నప్పుడు తీపి అంటే వెర్రి ఇష్టంగా ఉండేది. ఆరోజు పొద్దున్నే అమ్మ కొత్త పంచదార పొట్లం విప్పి డబ్బాలో పోస్తోంది, నేనేమో దొంగతనంగా ఓ గుప్పెడు నోట్లో పోసుకుని స్నానాల సందులోకి వచ్చేసాను, తలంటుకునే నెపంతో! ఇంతలో నువ్వు వచ్చావు. ..." ఈసారి సిగ్గుపడటం సుబ్బులు వంతయింది. విషయం పూర్తి చేయకుండానే చివాలున అతని గుండెలో ముఖం దాచుకుంది ఎర్రబడ్డ ముఖంతో, ముంచుకొచ్చిన సిగ్గుతో!

పాపం! తన తొలి ముద్దు అనుభవంతో ఇంతవరకూ "అధరామృతం" అంటే నిజమేననుకుంటున్న కామేశం తెలుగు పాండిత్యం తెల్లబోయింది!!



(ఆంధ్ర సచిత్ర వారపత్రిక 3.9.1982 వినాయకచవితి సంచిక)




"ప్రీతీ!... కిరణ్ ఎవరు?"

తుళ్ళి పడింది ప్రీతిక అను కోకుండా ఎదురైన ప్రశ్నకు! స్పూన్‌తో పుడింగ్‌ను నోట్లో పెట్టుకోబోతున్న చెయ్యి వణికింది. స్పూన్‌ను కప్పులో జారవిడిచి, చూపుల్ని టేబుల్ మీద నున్న కప్పు మీద కేంద్రీకరించి నిశ్శబ్దంగా కూర్చుండిపోయింది.

రెండు క్షణాలు గడిచాయి.

“తప్పు చేయని వాళ్ళెవరూ తడబడరు!... నువ్విలా తటపటాయిస్తున్నావంటే...” అపర్ణ కంఠం ఖంగుమంది.

“నో మమ్మీ... నో! అలాంటిదేమి కాదు... అసలు... నేను... నేనే నీతో చెబుదామనుకుంటున్నాను. కానీ...” ప్రీతిక పూర్తి చేయకముందే అపర్ణ కంఠం మరోసారి ఖంగుమంది.

“అదే ఎందుకు చెప్పలేకపోయావు? అసలు ఎవరతను? నీతో అంత చనువు ఎలా పెంచుకోగలిగాడు?”

తల్లి గద్దింపులకు ప్రీతిక కళ్ళలో నీళ్లు కదిలాయి. తనకు ఊహ తెలిసిన తర్వాత, తల్లి తనతో అంతలా కఠినంగా మాట్లాడటం ఇదే మొదటిసారి!

కంఠంలో దుఃఖపు జీరలు అడ్డు పడుతుండగా చెప్పింది. “కిరణ్... అదే-ప్రభు కిరణ్ పేరున్న రచయిత. అతని రచనలు, కథలు కాని, నవలలు కాని రాని పత్రికలు అరుదు. చిన్న వయసులోనే ఎంతో పేరు ప్రఖ్యాతులు సంపాదించాడు.”

“ఊ! మీరిద్దరూ జీవితాన్ని పంచుకోవాలనుకునేంత సాన్నిహిత్యం ఎలా కలిగింది? అదీ, నిన్ను కళ్లల్లో పెట్టి కాపాడుకుంటున్న నా కళ్ళు గప్పి! మీ నాన్న పోయినా చిన్నతనం నుంచీ నిన్ను పెంచి పెద్ద చేసి, విద్యాబుద్ధులు చెప్పించి, అడిగినవీ అడగనివీ అన్నీ అమరుస్తున్న తల్లి నీకు తగిన పెళ్లి కొడుకును చూడలేక పోతుందనుకున్నావా? పెళ్లి చేయలేక పోతుందనుకున్నావా?”

ఆ స్వరంలోని తీవ్రతను తట్టుకోలేక “మమ్మీ” అంటూ ఒక్కసారిగా బావురుమంది బేలగా పద్ధెనిమిదేళ్ళ ముగ్ధ ప్రీతిక.

ఒక్క క్షణం తన కఠినత్వానికి తనే బాధపడినా మరుక్షణంలో ఆగ్రహం రెట్టింపయింది అపర్ణలో! ఇంత వ్యవహారం జరుగుతున్నా ఇంతకాలం నుంచి తెలుసుకోలేక పోయినందుకు!

“ఛీ! స్టాపిట్! ... ఐ హేట్ వీపింగ్!” చిరాకుగా అంది అపర్ణ.

ఏడవటం ఆపినా చాలాసేపు వెక్కుతూనే ఉంది ప్రీతిక. ఆమెకంతా ఆశ్చర్యంగా అయోమయంగా ఉంది. తన ప్రాణ స్నేహితురాళ్ళకు కూడా తెలీని ఈ సంగతి ఇంత త్వరగా మమ్మీకి ఎలా తెలిసిపోయింది? అదే ఆమెకు అంతుబట్టకుండా ఉంది!

తల్లిదండ్రులు ఈ పీరియడ్ లోనే తమ గురించి నిత్యం ఆదుర్దా చెందుతూ ఉంటారని, ఎంతో జాగ్రత్తగా వ్యవహరిస్తుంటారని ఆ వయసు పిల్లల్లో ఎవరికీ తెలియనట్లే ప్రీతికకు కూడా తెలియకపోవటంలో ఆశ్చర్యం లేదు. కానీ తల్లీ తండ్రి తనే అయి వెయ్యి కళ్ళతో కూతుర్ని'కాపాడుకుంటున్న'అపర్ణకు ఎలా తెలియకుండా ఉంటుంది?

"నాకు ఎలా తెలిసిందని ఆలోచిస్తున్నావా?"

సూటిగా తన భావాలను చదివేసి మాట్లాడుతున్నట్లున్న తల్లి ప్రశ్నకు తత్తరపడింది ప్రీతిక! సజలనయనాలను విప్పార్చుకుని తల్లి వైపు నిస్తేజంగా చూస్తూ ఉండిపోయిన ప్రీతిక

"నేను నీ తల్లిని కాబట్టి! నీ పైనే ఆశలు పెట్టుకుని బ్రతుకుతున్న దాన్ని కాబట్టి!" అంటూ తన ఎదురుగా పడేసిన కవరును చూడగానే ఉలిక్కిపడింది.

"చూడు! ప్రతి తల్లి తన బిడ్డ పసితనంలో పారాడుతున్నప్పుడు చేతులు కాళ్లు కాల్చుకోకుండా ఉండాలని శతవిధాల కనిపెట్టి చూసుకుంటుంది. అయినా ఏదో ఒక దురదృష్ట క్షణంలో తను ఓడిపోతుంది. నేను అలాంటి ఓ తల్లిని కాకూడదని ఈ క్షణం వరకు ఆరాటపడుతూ వచ్చాను. కానీ ఇప్పుడే తెలిసింది! నీ భవిష్యత్తు నా చేతిలో గాని, నీ చేతిలో గాని లేదని!... బట్... నీ ముందున్న కవరులో ఉందని! ఎంత వింత పరిస్థితి ఇది!"

మాటలు కరుకుగా ఉన్నప్పటికీ మనసులో సుళ్ళు తిరుగుతున్న ఆవేదనను, ఆవేశాన్ని, ముంచుకొస్తున్న దుఃఖాన్ని అదిమి పెట్టుకుంటూ 'ప్రీతిక'ను ఒంటరిగా వదిలి లోపలికి వెళ్ళింది అపర్ణ.

చేతులు వణుకుతూ ఉండగా కవరును అందుకుంది ప్రీతిక. తెరచి ఉన్న కవరులోంచి ఉత్తరాన్ని బయటకు తీసింది. అందులోని అక్షరాల వెంట ఆమె కళ్ళు పరుగెత్తసాగాయి.

"ప్రియాతి ప్రియమైన ప్రీతికా! సౌగంధ సుమవీచికా! నువ్వు రాసిన పదహారో ఉత్తరం అందింది. ఉత్తరం ఆసాంతం చదివిన తర్వాత నాకేం అనిపించిందో తెలుసా! శీతాంశుకిరణుని పదారు కళల సోయగాలు నీలో ఉన్నాయని, వాటిని ఒకటొకటిగా నీ ప్రేమ లేఖల్లో కురిపించావని! ఇప్పుడు మన ప్రేమ పౌర్ణమి నాటి వెన్నెల చందమని!

దొంగా! నువ్వంటే నాకు ప్రేమని వేరే చెప్పాలా? నువ్వంటే నాకిష్టమని, ఇష్టమంటే ప్రేమేనని నీ కన్నె మనసుకు తెలియని సంగతా! నీ ఉత్తరంలోని ప్రతి అక్షరంలోనూ నీ చిలిపి నవ్వు, తీపి పలుకు, నా ఎదురుగానే నువ్వు ఉన్నట్టు అనిపిస్తున్నాయి.

నా గురించి బెంగా! నువ్వు నా వద్దకు రావటానికి నా అనుమతి కావాలా! పిచ్చిదానా! చంద్రుణ్ణి చూసి ఉప్పొంగటానికి సముద్రానికి ఎవరు అనుమతివ్వాలి? ఆమని ఆగమనానికి పరవశించిన కోయిల గానానికి ఎవరి అనుమతి కావాలి? ప్రేమ సంగమం హృదయంగమం! క్షణక్షణం అనుక్షణం... ప్రీతికా! నీకై ఎదురు చూస్తూ ఉంటానిక!

నీ
కిరణ్."

ఉత్తరం మొదటినుంచి చివరిదాకా ఏకబిగిన చదివిన ప్రీతికకు చిత్రంగా ఏదో ధైర్యం వచ్చినట్లయింది. ఇంతకుముందు ఆమెలో ఉన్న ఆందోళన అంతా ఉపశమించినట్లు అనిపించింది. ఆ ఉత్తరాన్ని తీసుకొని తన రూంలోకి వెళ్లి బెడ్ మీద వాలిపోయి మళ్లీ మళ్లీ, ఆ ఉత్తరాన్ని చదువుతున్న ప్రీతికకు కిరణ్ తో తన తొలి పరిచయం తలపు కొచ్చింది.




కాలేజీ మేగజైన్‌కు ఆ సంవత్సరం తను సంపాదకురాలుగా ఎన్నికయింది. మామూలు పద్ధతిలో నాలుగు గేయాలు, నాలుగు కథలు, మరో నాలుగు వ్యాసాలు, ఓ ఇరవై ప్రకటనలు వేసేసి స్టీరియో టైప్‌గా మ్యాగజైన్ను తయారుచేయడం తనకు ఇష్టం లేకపోయింది. స్టూడెంట్స్ ప్రతిభను ప్రదర్శించటానికి అవకాశంతో పాటు మరేదో భిన్నమైన వినూత్నత్వాన్ని ప్రవేశపెట్టాలని చాలా సీరియస్‌గా నిశ్చయించుకుంది. కానీ దాన్ని ఎలా అమలు చేయాలో మాత్రం నిర్ణయించుకోలేక తీవ్రంగా కొట్టుమిట్టాడుతున్న సమయంలో ఓ రోజు.... ఆరోజు ఉదయం పేపరు చూస్తున్నప్పుడు కనిపించిన వార్త ఆమె మస్తిష్కంలో ఒక ఆలోచనను స్ఫురింపజేసింది. కానీ అది సాధ్యమా? అందుకే- కాలేజీలో తన స్నేహితురాళ్ళిద్దరికి

ఈ విషయం చెప్పి తనకు సహాయంగా రమ్మంది. అయితే తన ఆలోచన వాళ్లకు హాస్యాస్పదంగా తోచింది. రామంటే రామన్నారు! పైగా

"చూడు! కావాలంటే ఆ సన్మాన సభకు వెళ్ళి దూరం నుంచి చూసి వచ్చేద్దాం. అంతేకానీ 'ప్రభు కిరణ్'గారితో ఇంటర్వ్యూ అంటే మాత్రం మన వల్ల అయ్యేపని కాదు! ముప్పైరెండేళ్ళ వయసులో సాహిత్య అకాడమీ అవార్డు అందుకున్న గొప్ప రచయిత ఆయన! యూకేజీ పిల్లలు మొదలుకొని తొంభై ఏళ్ల ముసలాళ్ళదాకా అన్ని తరాల వాళ్ళకీ ఆరాధ్య రచయిత! రాజూ ఏడుగురు కొడుకులు మొదలు వాలఖిల్యోపాఖ్యానందాకా అన్నిటిని తన కలం ద్వారా రసరమ్యంగా మలచగల మహా రచయిత! అసలు ఆ ఆడిటోరియంలోకి మనకు ప్రవేశమే లభిస్తుందనుకోను, అటువంటిది, ఆ ఘనసన్మానం మధ్య ఆయన్ను కలిసి మాట్లాడి, పైగా మన బోడి కాలేజీ పత్రికకి ఇంటర్వ్యూ సంపాదించటమా?" అంటూ హేళన చేసేశారు.

దాంతో తనకి పంతం హెచ్చింది. ఎలాగైనా సరే అనుకున్నది సాధించాలి! తనేమిటో నిరూపించుకోవాలి! అందుకే స్నేహితురాళ్ళు చెప్పింది అంగీకరించినట్లు నటించి అప్పటికి ఊరుకుంది. ఆరోజు 'మమ్మీ' ఊళ్లో లేకపోవడం కూడా కలిసివచ్చింది. సాయంత్రం అవగానే ప్రత్యేకంగా అలంకరించుకుని యూనివర్సిటీ ఆడిటోరియానికి వెళ్ళింది. అప్పటికే ఆడిటోరియం అంతా నిండిపోయింది. అది చాలక ఆవరణ నిండా, కారిడార్ల నిండా జనం! నెమ్మదిగా కార్లనీ, స్కూటర్లనీ, జనాల్ని తప్పించుకుంటూ సరాసరి డయాస్ దగ్గరున్న ఎంట్రెన్స్ దగ్గరకు వెళ్ళింది. లోపల నాలుగైదు కుర్చీలు ఖాళీగా కనిపిస్తున్నాయి. ఎంట్రన్సు దగ్గర ఎవరూ ఉన్నట్టు లేదు. ఒక్కసారి ధైర్యం చేసుకుని తాపీగా లోపలకు వెళ్లి కొంచెం పెద్ద వయసున్న ఒకాయన పక్కన ఖాళీగా ఉన్న కుర్చీలో కూర్చుంది.

కొంచెం స్తిమితపడ్డాక డయాస్ వంక చూసింది. అప్పటికే కార్యక్రమం మొదలై కొనసాగుతోంది. ఎవరో ఒక వక్త జోరుగా ఉపన్యసిస్తుంటే చిరునవ్వుతో వింటున్నాడు కిరణ్.

"..... ఈయేటి అకాడమీ అవార్డు మేటి రచయిత మన ప్రభుకిరణ్ గారు రచించిన 'సాంప్రదాయం'అనే నవలకు లభించడం నేను ఎంతో హర్షిస్తున్నాను. ఆ సందర్భంగా ప్రభు కిరణ్ గారికి ఈ అభినందన సభ ఏర్పాటు చేయడం, దానికి నేను అధ్యక్షుడిగా ఉండడం, నేను ఎంతో సంతోషిస్తున్నాను. అకాడమీ ఈయన రచనకు అవార్డు ఇచ్చి తనను తాను సన్మానించుకుంది..."

వింటున్న ప్రీతిక మనసులో ఓ ఆలోచన తళుక్కుమంది! వెంటనే ఓ చీటీ వ్రాసి తన వైపే చూస్తూ నిలబడిన ఓ వాలంటీర్ను పిలిచి అధ్యక్షుల వారికి ఇమ్మని చెప్పింది. ఆమె ప్రయత్నం ఫలించింది. మిగిలిన వ్యక్తుల ఉపన్యాసాలు ఉపశమించిన తర్వాత, "ఇప్పుడు ఒక అభిమాని అభినందన!" అంటూ ప్రీతికను వేదికపైకి పిలిచాడు అధ్యక్షుడు. కిరణ్ దృష్టిని ఆకర్షించడానికి ఈ అవకాశం చాలామెకు! వేదికపైకి ఎక్కి, మైకు ముందు నిల్చొని గొంతు సవరించుకుంటున్న ప్రీతిక వంక ఆసక్తిగా చూసాడు కిరణ్. క్రీగంట అతన్ని గమనించి చిరునవ్వుతో అంది ప్రీతిక.

"నాది అభినందనం కాదు?... బహుశా అభిశంసనం కావచ్చు"

అధ్యక్షుల వారికి మతి పోయింది. కంగారుగా ఏదో అనబోయాడు. కిరణ్ చిరునవ్వుతో వారించాడు.

"అకాడమీ అవార్డు లభించిన ఈ రచనలో భాషాపరంగా ఎన్నో స్పెల్లింగ్ మిస్టేకులున్నాయి. అసలు ఈ గ్రంథం పేరే తప్పు! 'సాంప్రదాయం' అని కాక 'సంప్రదాయం' అని ఉండాలి.

మనం పాశ్చాత్యులను తిండి నుంచి పడక దాకా అనుకరిస్తాం. కానీ వాళ్ల భాష మీద వారికున్న శ్రద్ధ మన భాష మీద మనకు ఉండదు! మన భాషను కూడా 'బ్రౌన్'లాంటి పాశ్చాత్యులే అభివృద్ధి చేయాలి! ఉన్న దీర్ఘాలను తీసివేయడం, లేని చోట పెట్టడం ఇలాంటి చిన్న చిన్న తప్పులు అవార్డు రచనల్లో ఉంటే అది అపహాస్యం మాత్రమే కాదు అగౌరవం కూడా! సాంప్రదాయం, సామ్రాట్టు, స్వారాజ్యం లాంటి పదాలు ఈ రచనలో కూడా చోటుచేసుకోవడం విచారకరం.

మేధస్సు అనే పదం తప్పు. మేధ అని ఉండాలి! స్వరాజ్యం అంటే సొంతరాజ్యం అని అర్థం. స్వారాజ్యం అంటే స్వర్గలోకం అని అర్థం! అర్థాల్లో ఎంతో తేడా ఉంది. మన స్వతంత్ర పోరాట కాలంలో కూడా చాలామంది ఇలాగే స్వారాజ్యం, స్వారాజ్యం అని నినాదాలు చేసేవాళ్ళుట! బహుశ అందుకే కాబోలు వాళ్లకు స్వారాజ్యమే దక్కింది."

వింటున్న శ్రోతలు ఆమె చమత్కారానికి హర్షధ్వానాలు చేశారు. కిరణ్ కూడా శ్రుతి కలిపాడు. అలాగే మరి కొంచెం మాట్లాడి ముగించిన ప్రీతిక వాగ్ధాటి అందరినీ ఆకట్టుకుంది. కిరణ్ సభ ముగిసిన తరువాత ప్రత్యేకంగా అభినందించడంతో ఆమె పని సుగమం అయింది. కిరణ్ ఇంటర్వ్యూ మాత్రమే కాక, ప్రత్యేకంగా వ్రాసిన కథ కూడా సంపాదించి ప్రచురించడంతో కాలేజీ మ్యాగజైన్ ఆమెకు మంచి పేరు తెచ్చింది. అన్నింటికంటే ఆమెకు కిరణ్ తో పరిచయం అపురూపమై చివరికీ రూపం దాల్చింది!

ఆలోచనల్లోంచి బయటపడిన ప్రీతిక మళ్లీ మళ్లీ ఆ ఉత్తరాన్ని చదవటంతో ఏదో స్ఫురించినట్లయింది.

* * * *

ఇంటి ముందు ఆగి, ఒక్కసారి అడ్రసు సరిచూసుకొని కంపిస్తున్న చేతులతో గేటు తీసుకుని, ముందుకు నడిచింది ప్రీతిక. గుమ్మం దగ్గర గోడమీద కాలింగ్ బెల్ స్విచ్ నొక్కింది. లోపల్నుంచి ఎవరో వస్తున్న అలికిడి! రెండడుగులు వెనక్కి వేసి అదిరే గుండెలతో తలుపు వంక చూస్తూ నిలుచుంది. కానీ తెరుచుకున్న తలుపుల వెనకకు చూసిన ప్రీతికకు నిరాశ ఎదురయింది. తలుపు తెరిచింది తను ఎంతో ఉత్సాహంగా ఎదురుచూసిన తన కలల రూపం కాదు. అరవైయ్యేళ్ల ముసలాయన! ప్రీతిక ఉస్సురని నిట్టూర్చింది!

"ఎవరమ్మా! ఏం కావాలి?"

తలుపులు పూర్తిగా తెరిచి గంభీరమైన కంఠంతో ఆయన ప్రశ్నించగానే ముందు కొంచెం సేపు సందేహించింది ప్రీతిక. మళ్ళీ ఆయన అదే ప్రశ్న వేసేసరికి నోరు విప్పక తప్పలేదు.

"నేను... నేను... కిరణ్ గారి కోసం వచ్చానండి! వారు ఉండేది ఇక్కడే కదా!"

ప్రీతిక సమాధానం విన్న ఆయన ఒక్కసారి నిశితంగా ఆమె వైపు చూసాడు.

పద్దెనిమిదేళ్ల ప్రాయపు కన్నె పిల్ల ఉషోదయపు తొలి వెలుగులో, దట్టంగా విరిసిన పొగమంచు మధ్య, చిరు చలి లో అమాయకపు ముఖంతో, ఒంటిగా...

"అవును ఇదే! ముందు నువ్వు లోపలకు రామ్మా" ఆప్యాయంగా లోపలికి పిలిచాడామెను.

"కూర్చోమ్మా!" అంటూ డోర్ కర్టెన్ ముందుకు లాగి సోఫా చూపించాడాయన.

"నీ పేరేమిటమ్మా?" కూర్చున్న ప్రీతికను మృదువుగా అడిగాడు.

"ప్రీతిక" ఒద్దికగా సమాధానం చెప్పింది.

"ఏ ఊరమ్మా మీది?"

ఇంటర్వ్యూలో అభ్యర్థిని కంగారు తగ్గి సెటిలయ్యేదాకా ఎగ్జామినర్లు ప్రశ్నించినట్లు ఆయన నెమ్మదిగా ఒకదాని తరువాత ఒకటి ప్రశ్నిస్తున్నాడామెను.

"హైదరాబాదండీ!"

"ఓహో! గోదావరి ఈరోజు కొంచెం ముందుగా వచ్చినట్లుంది. సరే! అదుగో ఆ మూల గదే బాత్రూం. ముందు కొంచెం ఫ్రెష్ గా అయిరా!"

ప్రీతిక లేచి బాత్ రూం లోకి వెళ్ళబోతూ ఆయనవంక చూసి ఏదో అడగాలని నోరు తెరిచింది.

"మనం తీరిగ్గా మాట్లాడుకుందాం! ... యూజ్ యువర్ సెల్ఫ్."

ఆయన మాటలు విని బ్రీఫ్ తెరిచి బ్రష్, బట్టలు తీసుకుని లోపలికి వెళ్లి తలుపేసుకుంది ప్రీతిక, మరేం అనకుండా!

ఆయన నెమ్మదిగా సోఫాలో వెనక్కి జారగిలబడి కళ్ళు మూసుకున్నాడు. ఆయన ఆలోచనల్లో ఏవేవో భావాలు కొట్టుమిట్టాడుతున్నాయి.

స్నానం చేసి, ఫ్రెష్ గా బాత్రూమ్ నుంచి బయటకు వచ్చిన ప్రీతికకు చాలా హాయిగా, తేలికగా అనిపించింది. మనస్సు ప్రశాంతంగా ఉందనిపించింది.

ఆయన కళ్ళు తెరిచి ప్రీతిక వంక చూచి దీర్ఘంగా నిట్టూర్చాడు.

"కూర్చో అమ్మా! కాఫీ తాగు."

అప్పుడు చూసింది ప్రీతిక, టీపాయ్ మీద ఉన్న రెండు కాఫీ కప్పులను, వేడిగా ఆవిరులు బయటకు వస్తూ, అప్పుడే వాటిని అక్కడ పెట్టినట్లుగా ఉన్నాయి.

ప్రీతికకు ఆశ్చర్యం వేసింది. దాంతో బాటు బాధ కూడా కలిగిందామెకు! ఆ వృద్ధునికి తను శ్రమ కలిగిస్తున్నందుకు. అసలు ఈయనెవరో తెలియదు తనకింతవరకూ! ఇంటి నలువైపులా చూసింది. మరెవరూ ఉన్న అలికిడి లేదు. అసలింతకీ కిరణ్ ఏడి? ఉన్నట్లా? లేనట్లా? లేక ఇంత ఉదయాన్నే నిద్రలేచే అలవాటు లేదా?

"ముందు కాఫీ తీసుకో! తర్వాత ఆలోచనలు!" చిన్నగా నవ్వుతూ ఓ కప్పు అందించాడామెకు.

"ఊ! ఇప్పుడు చెప్పు! మీ నాన్నగారు ఏం చేస్తుంటారు? నువ్వేం చదువుతున్నావు? అసలు నువ్వు ఇప్పుడు ఇక్కడికి ఎందుకు వచ్చావు?" కాఫీ సిప్ చేస్తూ ప్రశ్నించాడామెను.

ఏం చేయాలో పాలుపోలేదు ప్రీతికకు. అసలు తను వచ్చిందెవరికోసం? ఎంత ఊహించుకొంది తను? తనను అకస్మాత్తుగా చూసి కిరణ్ ఆశ్చర్య పోతాడని! ఆపై ఎంతో ఆనందిస్తాడని! అతని ఎదపై వాలి తన ప్రేమనంతా వ్యక్తీకరించాలని! తమ పెళ్లి గురించి అడగాలనీ! ఎన్నెన్ని ఆలోచించింది తను! కానీ ఇప్పుడిదేమిటి? ఇలాంటి విచిత్రమైన పరిస్థితిలో చిక్కుకుంది. పైగా ఈయన కిరణ్ గురించి ఏమీ చెప్పకుండా తన గురించి ఇన్ని వివరాలు అడుగుతున్నాడు? అసలీయనకు చెప్పవచ్చా? చెప్పాల్సిన అవసరం ఏమిటి?

"నేను కిరణ్‌ను కలవాలని వచ్చానండీ!" ఆలోచిస్తూనే అప్రయత్నంగా అనేసింది ప్రీతిక.

"నాకా విషయం తెలుసునమ్మా." ఆయన మందహాసం చేసి కాఫీ కప్పును టీపాయ్ మీద ఉంచుతూ అన్నాడు.

"చూడు! నువ్వు ఒకరిని కలవటానికి వచ్చావు! కానీ మరొకరు నిన్ను రిసీవ్ చేసుకున్నారు. ఇద్దరు కొత్త వ్యక్తులు కలుసుకున్నప్పుడు పరస్పరం పరిచయాలు చేసుకోవడం ఫార్మాలిటీ... కర్టెసీ కదా! పైగా నువ్వు చూస్తే ఎంతో సంస్కారవంతురాలిలా కనిపిస్తున్నావు కూడా!"

ఎర్రబడ్డ ప్రీతిక ముఖం వంక చూస్తూ అన్నాడాయన.

"ఓకే... నేనే ముందు పరిచయం చేసుకుంటాను. నేను నువ్వు అంత దూరం నుండి కలవాలని వచ్చిన కిరణ్‌కు తండ్రిని. ఇప్పుడు చెప్పు నే నడిగిన విషయాలు... మీ నాన్నగారేం...."

"మా నాన్నగారు నా చిన్నప్పుడే పోయారండి."

"ఐ యాం సారీ! దెన్..."

"మా అమ్మ పేరు అపర్ణ. ఆమె, నేను ఇద్దరమే మా ఇంట్లో. నేను కాలేజీలో బి.కాం. రెండో సంవత్సరం చదువుతున్నాను."

రెండు క్షణాలు నిశ్శబ్దంగా ఉండిపోయాడాయన.

"ఐసీ! ... హైదరాబాదులో మీరు ఉండేది ఎక్కడ?"

"బేగంపేట!"

"మీ అమ్మగారు ఏమన్నా ఉద్యోగం చేస్తూంటారా!"

"ఆ అవసరం మా కేమీ లేదు! మా తాతగారు గూడూరులో పెద్ద బిజినెస్ మాన్. మాకు అక్కడ మైకా గనులున్నాయి" కొంచెం దర్పంగా అంది ప్రీతిక.

"మీ తాతగారంటే..."

"మా అమ్మ నాన్న గారు... రాఘవ రాయుడు గారు."

ఆయన కొంచెం సేపు ఏదో ఆలోచిస్తున్నట్లు ఉండిపోయాడు. తర్వాత హఠాత్తుగా అడిగాడు.

"అలాగా!... అయితే నువ్వు ఇప్పుడు ఇక్కడికి ఎందుకు వచ్చినట్లు?"

ప్రీతికకి పట్టరాని ఉక్రోషం వచ్చింది. ఆయన తనతో ఆడుకుంటున్నట్లనిపించింది.

"నేను కిరణ్‌ను... అదే మీ అబ్బాయిని కలవడానికి వచ్చాను!"

ఆయన ప్రీతిక వంక నిశితంగా చూశాడు.

"నేను కొంచెం వృద్ధుణ్ణే కానీ, ఇందాక చెప్పిన దాన్ని ఇప్పుడే మరచిపోయేంత మతిమరుపు నాకింకా రాలేదమ్మా!"

ప్రీతిక కొంచెం సిగ్గుగా తలవంచుకుంది.

"నేనడిగింది దేని గురించో నీకు అర్థమై ఉంటుంది."

"మీతో చెప్పితీరాలంటారా?" పసిపిల్లలా మంకుగా అంది.

ఆయన ప్రీతిక వంక తీక్షణంగా చూశాడు. అంతలోనే నవ్వేసి ఆప్యాయంగా అన్నాడు.

"భోజనం, నిద్ర, ప్రయాణం, ఆలోచన వీటిని ఒంటరిగా చేయరాదని పెద్దలు అంటూ ఉంటారు. నీకన్నా వయసులో పెద్దవాణ్ణి. కిరణ్‌కు తండ్రిని కూడా! నాతో చెప్పాల్సిన అవసరం కాని, చెప్పటం వలన ప్రయోజనం కానీ నీకు లేకపోయినా, బహుశా నష్టం ఏమీ ఉండదనుకుంటాను!"

"ఐ యామ్ సారీ!... కానీ మీతో ఎలా... ఈ విషయం చెప్పాలో..." అర్ధాంతరంగా ఆపింది ప్రీతిక.

"సరే! అయితే... నేను ఒకటి అడుగుతాను చెప్పు!"

ఏమిటన్నట్లు కుతూహలంగా చూసింది ఆయన వంక ప్రీతిక.

"ప్రేమంటే ఏమిటి?"

బిత్తరపోయింది ప్రీతిక ఆయన ప్రశ్న వినగానే! కానీ ఏం సమాధానం చెప్పాలో తోచలేదామెకు. టీపాయ్ మీదకు చూస్తూ మిన్నకుండి పోయింది.

"ప్రేమంటే చెప్పలేని దానివి, పదహారు ఉత్తరాలు ఎలా వ్రాయగలిగావమ్మా?"

ఉలిక్కిపడి విస్మయంగా చూసింది ప్రీతిక ఆయనవైపు భీతిగా!

"అహ! నాకు తెలిసినందువలన నీ కొచ్చిన ప్రమాదమేమీ లేదు. నాకు ఎలా తెలిసిందన్నది కూడా అంత ముఖ్యం కాదు ప్రస్తుతం" ఒక్క క్షణం ఆగి అన్నాడాయన సూటిగా!

"అసలు కిరణ్‌కు, నీకు వివాహం జరుగుతుందని నువ్వు అనుకుంటున్నావా?"

"ఎందుకు కాదు? ఆ విషయమే నేను కిరణ్ తో మాట్లాడదామని వచ్చాను."

"ఐసీ! దీనికి మీ అమ్మగారు ఒప్పుకున్నారా?"

"మా మమ్మీకి మా ప్రేమ గురించి తెలుసు. తనకి ఇష్టం ఉన్నా లేకపోయినా... కిరణ్‌తో నా పెళ్లి జరిగి తీరుతుంది."

"ఏ కారణం చేతనైనా అది జరగకపోతే?"

"మీకు మా ప్రేమను భగ్నం చేయగల శక్తి ఉందని నేను అనుకోను. అసలు మా పెళ్లికి మీరు ఒప్పుకోకపోవడానికి కారణం కూడా నాకేమీ కనిపించడం లేదు. నేనేమీ డబ్బు చూసి కిరణ్ను ప్రేమించలేదు. డబ్బే ప్రధానమైతే మా 'మమ్మీ'కి నేను ఒక్కత్తినే! మా తాతగారి ఐశ్వర్యం అంతా నాకే వస్తుంది! మా ప్రేమకు అంతస్తులు అడ్డం కాలేవు. కావు!" ఆవేశంగా ఏకబిగిన మాట్లాడింది ప్రీతిక.

"ప్రేమ గుడ్డిది అని ఎందుకు అన్నారో నిన్ను చూస్తే అర్థమవుతుంది."

ఆ హేళనకు ఆమె కళ్ళల్లో నీళ్లు చిప్పిలాయి.

"మీరు చాలా కఠినంగా మాట్లాడుతున్నారు!"

"కావచ్చు... నీకో కథ చెప్తాను విను. అది విన్న తర్వాత ప్రేమ గురించి నీ అభిప్రాయం ఎంతవరకు నిజమో అంచనా వేసుకుందువు గాని, నువ్వు ఈ కథ వినటం చాలా సమంజసం అనుకుంటాను!"

ఆయన కళ్లు మూసుకుని చెప్పసాగాడు.

"దాదాపు యిరవై అయిదేళ్ళ క్రితం నాటి సంగతి! ఆ రోజుల్లో ఇప్పటిలా ఇన్ని వారపత్రికలు కానీ మాస పత్రికలు గాని లేవు. ఇప్పటిలా సాహిత్య సంస్థలు కూడా లేవు. ఇంతమంది రచయితలు రచయిత్రులు కూడా లేరు. రచనను వృత్తిగా చేసుకుని బ్రతకడానికి సాహసించలేని రోజులు. వ్రాసిన నవలను అచ్చు వేసేవారు కానీ, వేసినా తగిన ప్రతిఫలం ఇచ్చేవారు కానీ లేరు! అటువంటి కాలంలో వంశీమోహన్ అని ఒక రచయిత ఉండేవాడు. ఆ రోజుల్లో అతను వేళ్ళ మీద లెక్క పెట్టగల పాపులర్ రచయితల్లో ఒకడు! పుంఖానుపుంఖంగా వివిధ కథా వస్తువులతో, విభిన్న పోకడలతో, అసంఖ్యాకంగా నవలలు రాసి ఆ కాలపు యువతీ యువకుల హృదయాల్లో ఆరాధ్య రచయితగా వెలిగిపోయాడు. ఆయనకొచ్చే అభిమానుల లేఖలతో బస్తాలు నిండి పోయేవి! ముఖ్యంగా ఆయన రచనలు చదివి పిచ్చివాళ్ళయిన వాళ్లలో ఆడవాళ్ళ శాతం ఆ రోజుల్లోనే మగవాళ్ళను మించి ఉండేదంటే ఆయన పాపులారిటీని అర్థం చేసుకోవాలి! ఒకసారి ఆయన కొత్త నవల విడుదలైన పది పదిహేను రోజులకు, ఒకరోజు ఆయనకు వచ్చిన ఫాన్ మెయిల్ తీసుకురావటానికి పోస్ట్ మాన్ కు ఒక ప్రత్యేక మెయిల్ సంచి అవసరమైంది! బహుశా అది ఏ రచయితకీ జరిగి ఉండని సంఘటన కావచ్చు కనీసం ఆ రోజుల్లో!

రచయితగా తాను ఎంతో కీర్తి ప్రతిష్టలు సంపాదించాడు. కానీ సాంఘికంగా అతను చాలా సామాన్యుడు. తన రచనలు ప్రచురించే ప్రెస్ లోనే ఉద్యోగం చేస్తూ ఉండేవాడు. కంపోజింగ్, ప్రింటింగ్, ప్రూఫ్ రీడింగ్ సమస్తం తనే చూసుకుంటూ ఉండేవాడు. అతని వ్యక్తిగత వివరాలు కానీ కనీసం అతని చిరునామా కానీ ఎవరికీ తెలియదు. అలా తెలియటం అతనికి ఇష్టం ఉండేది కాదు. ఒక రోజున అతను

మామూలుగానే ప్రెస్ లో కంపోజింగ్ చేసుకుంటున్న సమయంలో పబ్లిషర్ - కం - ప్రొప్రైటర్ నుంచి పిలుపు వచ్చింది, ఎవరో తనను కలవటానికి వచ్చారని! మామూలుగానే ఎవరో వచ్చారని బయటకు వచ్చిన అతను విస్తుపోయాడు!

పదహారేళ్ల ప్రాయంలో, మిలమిల మెరిసే కలువ కళ్ళతో అజంతా శిల్పంలా, ఆరాధనా భావం ఉట్టిపడే దృక్కులతో, ఉద్వేగం నిండిన ముఖంతో ఒక అమ్మాయి! ప్రక్కన ఒక నడివయస్కుడు, మరొక యువకుడు.

“ఈయనే మీరడిగిన విఖ్యాత రచయిత వంశీమోహన్” అంటూ పరిచయం చేశాడు పబ్లిషర్.

ఆ అమ్మాయి కళ్ళు వెలవెలబోయాయి. ఆమె చూపుల్లో ఆరాధనా భావం అదృశ్యం అయింది! ఉద్వేగం ఉడిగిపోయింది! అప్రయత్నంగా గొణిగినట్లుగా అంది!

“.... కల కరిగిపోయింది నాన్నా!”

అయోమయంగా చూసాడు వంశీమోహన్!

చిందరవందర అయిన జుట్టు, నల్లటి ఇంకు మరకలు అంటిన బనీను, పాత లుంగీ, ముఖం నిండా వంటినిండా చెమట, అతి సాధారణంగా దాదాపు నలభయ్యవ పడిలో ప్రవేశించటానికి సిద్ధంగా ఉన్నట్టున్న ఈయనా తన ఆరాధ్య రచయిత! ఈయన్నేనా తను ప్రేమించింది? తన కలల్లో కళ్ళల్లో నింపుకుంది? పెళ్లి చేసుకోవాలని మనసుపడింది! ‘పెళ్ళంటూ చేసుకుంటే అతనినే’అంటూ ఒక్క కూతురన్న మమకారంతో ఉన్న తండ్రినీ, తల్లినీ బెదిరించి, భల్లూకపు పట్టుబట్టి, వాళ్లను వెంటబెట్టుకొని ఇక్కడకు వచ్చింది ఈ వ్యక్తి కోసమా? తన జానపద నవలల్లో వర్ణించే రాకుమారుని పోలిక, సాంఘిక నవలల్లోని హీరో రూపం, ఈయనలో కనబడవే? ఆమె నిశ్చేష్టురాలై నిలబడిపోయింది నీరసంగా!

విషయం తెలుసుకున్న వంశీ మోహన్‌కు విచారించాలో విలపించాలో అర్థం కాలేదు. పసిడితునక లాంటి అమ్మాయి వైపు చూశాడు. ఐశ్వర్యానికి

ప్రతిరూపంలా ఉన్న ఆమెతో వచ్చిన వాళ్ల వైపు చూశాడు. వాళ్లు వచ్చిన రాజహంస లాంటి కారు వైపు చూశాడు. తన వైపు చూసుకున్నాడు . మనసు కెలికినట్లయింది.

తెప్పరిల్లే సరికి వాళ్ళు లేరు! సాయంత్రం తాము ఉంటున్న ఖరీదైన హోటల్ కు రమ్మన్న ఆహ్వానం మిగిలింది!

ఆ సాయంత్రం హోటల్ కు వెళ్లిన తనకు మరో సమస్య ఎదురైంది.

“మా అమ్మాయి ఇప్పటికీ మిమ్మల్నే పెళ్లాడాలని నిశ్చయించుకుంది” అన్నాడు తండ్రి. ఆ మాటలు అంటున్నప్పుడు ఆయన కంఠం చిన్నగా వణికింది.

ఆ అమ్మాయి వంక చూశాడు. తల్లి పక్కన మౌనంగా నిలబడి ఉంది.

నెమ్మదిగా చెప్పాడు వంశీ మోహన్, “నాకు ఇదివరకే పెళ్లి అయింది ఒక పిల్లవాడు కూడా ఉన్నాడు!”

ఆమె దృఢంగా ఉంది. “నాకేమీ అభ్యంతరం లేదు!”

దిగ్భ్రమ చెందాడు తను. తర్వాత నెమ్మదిగా నచ్చచెప్పాడు.

“చూడమ్మా! నా వయసు ముప్పైఎనిమిదేళ్ళు. నా వయసు లో సగం కూడా లేదు నీకు! నాకు పెళ్లై పదమూడేళ్ళు! జీవితం వేరు! కథలు వేరు! ఒక రచయిత రచనలను బట్టి ఆ రచయితను అంచనా వేయటానికి ప్రయత్నించకూడదు. నా రచనలను బట్టి, నా పేరును బట్టి నువ్వేదో నేను చిన్నవాణ్ణనీ, పెళ్లికాని వాడినని, ఎంతో అద్భుతమైన వ్యక్తినని భావించటం వలన ఈ పొరపాటు జరిగింది!

వ్యక్తిగా రచయిత ఎలాంటివాడైనా అతను తన రచనల్లో ఆదర్శ వాదిగానే కనబడతాడు. మాకు లేని వాటిని, మేము చేయలేని వాటిని, మాకు అనుభవనీయం కానివాటిని ఎన్నిటినో కథలుగా, నవలలుగా మలిచి అందులో తృప్తి చెందుతాము మేము! అలాగే మీకు లేనివాటిని, మీరు చేయలేని వాటిని, మీకు అనుభవనీయం కానివాటిని మా రచనల్లో చదివి తాదాత్మ్యం చెందుతారు మీరు! ఇదంతా ఒక భ్రాంతి. మీరూ, మేమూ అందరం మామూలు మనుషులమే!

జీవితం నూరు పేజీల నవల కాదు, నూరేళ్ళపంట! దీనిని ఒక కలగా భావించి మరిచిపో! హాయిగా మీవాళ్లు ఎంచిన వరుణ్ణి పెళ్ళాడి, నేను కథల్లో, నవలల్లో వ్రాసిన అనురాగమయ దాంపత్యానికి ప్రతీకగా నిలబడు. నీది కేవలం అభిమానం మాత్రమే. నీ చిన్నతనం వలన దానిని ప్రేమ అనుకుంటున్నావు. బహుశా నువ్వు నా వయసుకు ఎదిగినప్పుడు దీనిని తలుచుకుంటే తప్పకుండా నవ్వుకుంటావు. నీకు శుభం జరగాలని ఒక అన్నగా మనస్ఫూర్తిగా ఆకాంక్షిస్తున్నాను".

చెప్పటం అయిపోయిన తర్వాత అందరి వంకా చూశాడు వంశీమోహన్. ఆ అమ్మాయి కళ్ళు సజలాలయ్యాయి. నెమ్మదిగా అతని దగ్గరకు వచ్చి పాదాలను తాకి నమస్కరించింది. అతని రెండు చేతుల్ని కళ్ళకద్దుకుంది.

చెప్పటం ఆపి ప్రీతిక వంక చూసాడాయన.

"ఇప్పుడు చెప్పు! ప్రేమంటే గుడ్డిదా? కాదా?" ఏదో భావనాసీమల్లో విహరిస్తున్నట్లున్న ప్రీతిక తేరుకొని అంది.

"ఆ పరిస్థితులు వేరు! ఈ పరిస్థితులు వేరు! అసలు ముఖ పరిచయమే లేకుండా ఏదేదో ఊహించుకున్నందువల్ల జరిగిన సంఘటన అది! కానీ నాకు, కిరణ్‌కు సంవత్సరం పైగా పరిచయం ఉంది. ఒకరి గురించి ఒకరు పూర్తిగా తెలుసుకున్నాము! మా ప్రేమ..."

"స్టాపిట్ దేర్! ప్రేమ గుడ్డిదయినప్పుడు దానికి కాలమానంతో నిమిత్తం లేదు. కిరణ్ గురించి నీకు ఏమీ తెలియదని చెప్పటానికే ఈ కథ చెప్పాను. అదే అనుభవం నీకు ఎదురయితే నువ్వేం చేస్తావు? కమాన్... టెల్ మీ!" ఆయన కంఠం కరుకుగా ఉంది.

"అంటే.... అంటే.... ఏమిటి మీరనేది?" చెప్పరాని ఆందోళనతో అడిగింది ప్రీతిక.

"సరే నీకు ఒక వ్యక్తిని పరిచయం చేయడం మర్చిపోయాను మొదట్లో!... బహుశా అది ఇప్పుడు చేయటం సమంజసం అనుకుంటాను" అని ఆయన "వీణా!" అంటూ కేకేసాడు.

ఒక నిమిషం తరువాత డోర్ కర్టెన్ తొలగించుకొని లోపల్నుంచి వచ్చిందొక యువతి.

"ఏమిటి మామయ్యా?" అంటూ.

"ఆ!... ఏమీ లేదమ్మా!... ఈ అమ్మాయి మీ ఆయన కిరణ్‌కు ఆరాధ్య పాఠకురాలుటమ్మా! చూద్దామని వచ్చిందట! నిన్ను పరిచయం చేద్దామని!..."

"నమస్తే!" వీణ మీటినట్లుగా ఉన్న వీణ నమస్కారానికి ప్రత్యభివాదం కూడా చేయలేనంతగా ప్రీతిక నవనాడులూ కృంగిపోయాయి.

వినయంగా "వస్తాను మామయ్యా! లోపల పని ఉంది." అంటూ వెనుదిరిగి లోపలికి వెళ్ళిపోయింది ఆమె!

ప్రీతికకు ఏం మాట్లాడాలో తోచలేదు. అయోమయంగా, స్తబ్ధంగా ఉండిపోయింది. ఆమెకు ఎదలోతుల నుంచి దుఃఖం తన్నుకొస్తోంది! కళ్ళలోంచి లావా ఉరకటానికి సిద్ధంగా ఉంది! పెదవులు విప్పితే సుళ్ళు తిరుగుతున్న ఉద్రేకం ఎక్కడ బయటకు ఉరుకుతుందోనని పెదవులను పంటితో నొక్కుకుంటూ తనని తాను అదుపులో పెట్టుకోవటానికి ప్రయత్నిస్తున్న ప్రీతిక వంక జాలిగా చూస్తున్నాడాయన.

నిమిషాలు భారంగా గడిచాయి.

ప్రీతిక మనసులో ఎన్నో ఆలోచనలు, అసలు జరిగింది నిజమేనా? ఎలా జరిగింది? తనెలా ఈ మోహంలో చిక్కుకుంది? తనకెందుకు కిరణ్ కు పెళ్లి అయి ఉంటుందన్న ఆలోచన రాలేదు? పోనీ అతనెందుకు వ్రాసి ఉండకూడదు? అసలిలా జరగవచ్చునన్న ఊహ తనకి ఎందుకు రాలేదు? తనెంత బుద్ధిహీనంగా ప్రవర్తించింది? ఇప్పుడు మమ్మీకి మళ్లీ తన ముఖం ఎలా చూపిస్తుంది?

ప్రీతిక ఆలోచనలు భగ్నం చేస్తూ ఆయన గొంతు సవరించుకున్నాడు.

"జీవితంలో అనుకోనివి జరగటం ఎంత సహజమో, అనుకున్నవి జరగకపోవడం కూడా అంతే సహజం తల్లీ! కానీ మంచికి దారి తీసే మలుపు




ఊహించినది అయినా, ఊహించనిది అయినా దానికి విచారించాల్సిన పని లేదు! నీలో ఎగిసిపడే భావాలు నేను గ్రహించగలను. కాని ఇది ఇలా ఎందుకు జరిగిందన్న ప్రశ్నకు సమాధానం తెలుసుకోలేనంత పిన్న వయసులో నువ్వు లేవనుకుంటాను. ప్రలోభం అనేది మానవజాతి పుట్టినప్పటినుంచి ఉన్న బలహీనత! దీన్నుంచి తప్పించుకోవటం విశ్వామిత్రాది ఋషి సత్తములకే సాధ్యపడలేదు! మన దొడ్లో గులాబీ పువ్వు పూసినా, పొరుగు దొడ్లోని మందారం పై ఆశపడడం సృష్టిలోని విచిత్రం!

కిరణ్ కు నువ్వు రాసిన పదహారో ఉత్తరాన్ని నేను యాదృచ్ఛికంగా చూడడం జరిగింది. ఈ విషయంలో నా వంతు బాధ్యత నేను నిర్వర్తించాల్సిన అవసరాన్ని గుర్తిస్తున్న సమయంలోనే నిన్న నీ టెలిగ్రామ్ అందటం జరిగింది. కిరణ్ సమయానికి ఊర్లో లేకపోవటం కూడా అనువుగా కుదిరింది. ఒక విపరీత పరిణామం జరక్కుండా ఆగిపోవటం నిజంగా మన అదృష్టం! నీకు ఎంతో భవిష్యత్తు ముందు ఉంది! ఈనాటి ప్రపంచంలో ప్రేమ అనేది ఎంత నిజమో అంత అబద్ధం! నువ్వు వివేకవంతురాలివి, ఈ దురదృష్టకర సంఘటన విషయంలో అనాలోచితంగా ప్రవర్తించవని నేను అనుకుంటున్నాను!”

అంటూ ఆపి ప్రీతిక వంక చూసాడాయన.

ఎర్రగా ఉన్న కళ్ళ నుంచి జాలువారుతున్న కన్నీళ్లను ఒత్తుకుంటూ అప్పటిదాకా ఆయన చెప్పినదంతా విన్న ప్రీతిక నెమ్మదిగా, దృఢంగా అంది!

“అంకుల్! నేను ఎంతో ఔన్నత్యం, వ్యక్తిత్వం ఉన్న మమ్మీ చేతుల్లో పెరిగాను. జీవితం పట్ల అవగాహన, ఆలోచన నా పెంపకంలో ఉంది. డ్రైవరు ఎంత అనుభవజ్ఞుడైనా ఒకప్పుడు బండి పట్టాలు తప్పవచ్చు. నేను చేసింది పొరపాటు కావచ్చు! అంతమాత్రాన జీవితాన్ని అంతం చేసుకునే అనాలోచితమైన పనులు చేసే పిరికిదాన్ని కాదు! నా జీవితాన్ని ఎలా తీర్చి దిద్దుకోవాలో నాకు తెలుసు! ఆ ఆత్మ విశ్వాసం నాకుంది. కానీ... కానీ... ఆదర్శవాదిగా ఉండాల్సిన ఒక రచయిత, యువతరానికి తన ఆరోగ్యకరమైన ఆలోచనలతో, ఆచరణతో, ఆదర్శంగా నిలబడాల్సిన రచయిత ఇలా దిగజారిపోవడం నాకు ఆవేశాన్ని, బాధనూ కలిగిస్తోంది. పైగా ఇది నా విషయంలో జరగటం నాకు సిగ్గుగా ఉంది!”

తలవంచుకున్న ప్రీతిక వంక సాలోచనగా చూశారాయన.

* * * *

పోస్ట్ మాన్ అందించిన కవరును విప్పింది అపర్ణ.

“అమ్మా! అపర్ణా!

నీకిలా ఉత్తరం రాసే అవసరం, సందర్భం వస్తాయని, ఆనాడు... నువ్వు చెల్లెలుగా అభిమానాన్ని నింపి వెళ్లిన రోజున నాకు ఊహాతీతమైన విషయం. బహుశ రచయితగా జీవితంలో నాకు తటస్థపడిన ఆ సంఘటన మరే రచయితకైనా ఎదురయిందో లేదో నాకు తెలీదు కానీ, ఇప్పటి అనుభవం అనితరం కావచ్చు.

రచయిత కూడా ఉపాధ్యాయుడి వంటివాడు! తన నీతుల ద్వారా మాత్రమే కాక చేతల ద్వారా కూడా సమాజానికి మార్గదర్శకం కావాలని మా తరంలో చాలామంది ఆంతర్యంగా ఉండేది! కనీసం నేను అలా భావించేవాడిని. కానీ ఈ తరం రచయితల్లో అలాంటి భావన చాలామందికి తగ్గిపోతోందనుకుంటాను. రచనకు వ్యాపారాత్మకత అబ్బినప్పుడు ఇలా జరగటంలో అంత అసహజం లేదనుకుంటాను! జీవితపు విలువల గురించి ఆక్రందనలు తప్ప ఆచరణ మృగ్యమవుతున్న ఈ కాలంలో, శాశ్వతమైన అనుభూతులకు కాక క్షణికమైన అనుభవాలకు లొంగిపోతున్న ఈ తరంలో రచయిత కూడా మామూలు మనిషిలా ప్రవర్తించడం అనివార్యమవుతుందేమో! ఇదంతా నేను కిరణ్‌ను సమర్థిస్తూ రాస్తున్నానని భావించకు! నేను నా కొడుకు నేరాన్ని సమర్థించే తండ్రిగా నిలబడదల్చుకోలేదు! అందుకే భగవంతుడు నాకీ అవకాశాన్ని ఇచ్చాడనుకుంటున్నాను. ఏ తండ్రి అలా సమర్థించడాన్ని కూడా నేను హర్షించను! ఏదేమైనా జరగబోయిన ఒక అనర్థాన్ని సకాలంలో ఆపగలిగినందుకు నా వంతు బాధ్యత నేను నిర్వర్తించగలిగినందుకు సంతృప్తి పడుతున్నాను. నీ కూతురుకు నీ పోలికలు వచ్చినా, నా కొడుక్కి నా పోలికలు రానందుకు చాలా చాలా విచారంగా ఉంది. నా నుంచి రచనా వ్యాసంగం వారసత్వంగా అబ్బింది కానీ, ఆశయాలు, ఆలోచనలు, ఆచరణ కాదని నాకిప్పుడే అర్థమైంది.

రచయితలకు ఏ తరంలోనైనా, అపర్ణ, ప్రీతిక లాంటి అభిమానుల అవసరం ఎంతైనా ఉంది! కానీ దాన్ని ప్రేమగా రూపాంతరం చెందనిస్తే జరిగే పర్యవసానం అన్ని సందర్భాలలోనూ ఒకేలా ఉండకపోవచ్చు! ఇలా సుఖాంతం కాకపోనూవచ్చు!

నీకూ, ప్రీతిక కూ నా శుభాశీస్సులు,

నీ అన్నయ్య
వంశీ మోహన్."

ఉత్తరం ఆసాంతం చదివిన అపర్ణ మనసు ఆర్ద్రమయింది. పుస్తకాల షెల్ఫ్ దగ్గరకు వెళ్లి అందులోంచి ఓ పాత పుస్తకం తీసింది. చేతి వ్రేళ్ళు అప్రయత్నంగా పుస్తకాన్ని తెరిచాయి. ఆమె కళ్ళు ఆప్యాయంగా మొదటి పేజీ మీద అక్షరాల వెంట పరిగెత్తాయి.

'నీడల క్రీడలు'... అభిమానానికి ఆటపట్టయిన ఓ చెల్లికి అంకితం...

వంశీ మోహన్.

ఉత్తరాన్ని ఆ పేజీ మీద ఉంచి పుస్తకాన్ని మూసి, ప్రీతిక గదిలోకి నడిచింది అపర్ణ. మంచం మీద వెల్లకిలా పడుకొని దీక్షగా టేప్ వింటోంది ప్రీతిక కళ్ళు మూసుకుని! నిశ్శబ్దంగా దగ్గరకు వెళ్లి పుస్తకాన్ని ఆమె పక్కన ఉంచి వెనుదిరిగింది.

"నష్టోమోహః స్మృతిర్లబ్ధా..." మంద్రంగా వినిపిస్తోంది ప్లేయర్‌లో నుంచి గీతాగానం!



("యువ" మాసపత్రిక ఆగస్టు 1987 సంచిక)




**“నా** వరాలకొండ...ప్చ్... నా గారాల కూన, నా కన్నతండ్రి ప్చ్! నా బుజ్జి తండ్రి...ప్చ్ ప్చ్ ప్చ్.....”

ముఖమంతా ముద్దులతో నింపేస్తున్న రాజమ్మ నర్సింలు ఛీత్కారంతో ఈ లోకంలోకి వచ్చి పడింది. అతని వంక భయం భయంగా చూసింది.

“ఛూ, ... సిగ్గు లేదు... దీన... సంబడం! సంబడం పడిపోతోంది. ఈడేదో అక్కడికి అమ్మకూ అబ్బకూ పుట్టినోళ్ళా...ఛీ....”

నర్సింలు రంకెలు వింటూ దిగాలు పడిపోయిన రాజమ్మ తన ఒళ్లో కేరింతలు కొడుతూ ఆడుకుంటున్న రెణ్ణెల్ల పసికూన కేసి చూసింది, దీనంగా!

"ఎంత ముద్దొస్తున్నాడీడు! ఈడి ఒళ్ళు ఎలా మెరిసిపోతావున్నదో ఎండలో! బంగారులా! వొజ్జిరంలా! మల్లి పూల రేకుల మీద నల్లమరక పడ్డట్లుగా తెల్లని కళ్ళల్లో నల్లని కనుపాపలు! ఎర్రెర్రని పెదాలు, బూరెల్లాంటి బుగ్గలు... చిన్ని ముక్కు.... ఈడేదో శాపగ్రస్తాన తనకు పుట్టిండు గాని లేకుంటే ఏ గొప్పింటి కూనగానో పుట్టాల్సినోడు గాదా!"

ఆలోచనల్లోంచి తేరుకున్న రాజమ్మ ఆ మాటలే నర్సింలు తో అంది, వాణ్ణి గుండెలకు అదుముకుంటూ.

"ఒరేయ్ నర్సింలూ! నీకు కళ్ళు కన్పింపకపాయె గాని, యీణ్ణి సూసుంటే నువ్వలాగనేవోడివిరా ?"

రాజమ్మ మాటలకు నర్సింలు ముల్లు గుచ్చుకున్న కల్లు తాగిన కోతి లాగయినాడు.

"ఓసి నీ యవ్వ! ఆడెవడో.... ఎదవనాయాల నీతో కులికితే బుట్టినాడు గాదటే వీడు!... అందుకే ఉంటాడే దొరబాబులా! నాకు బుట్టినోడయితే అలాగెందుకుంటాడే! అసలూ యీణ్ణీ, నిన్నూ ముక్కలుగా నరకాలే! ఈణ్ణి....యీణ్ణి సూడ్డం గూడాటే!"

చిందులు తొక్కసాగాడు నర్సింలు మండిపడిపోతూ!

రాజమ్మ చివురాకులా కంపించి పోతూ అక్కడి నుండి వెళ్లిపోయింది నర్సింలుకు దూరంగా. పసికూనకు రొమ్మందించి కూర్చుండిపోయింది నిశ్చలంగా.

ఆమె మనస్సులో గతం సుళ్ళు తిరిగింది.

జరిగిన దాంట్లో తన తప్పేముంది...

నర్సింలూ, రాజమ్మ మొగుడూ పెళ్ళాలు. వాళ్ళ వృత్తి అడుక్కుతినడం. రాజమ్మకు ముప్పైయ్యేళ్ళుంటాయి, నర్సింలుకి ఇంకో అయిదో పదో ఎక్కువుంటాయి. వాడికి కళ్ళు లేవు. కానీ గొంతు ఉంది. ఏవేవో పాటలు

పాడుతూంటాడు. రాజమ్మ చేతిలో ఓ బొచ్చె... దాని భుజం మీద చెయ్యేసి వాడు నడుస్తూ, పాడుతూ ఊరంతా తిరుగుతారు వాళ్ళిద్దరూ! ఆ వచ్చిందే వాళ్ళ సంపాదన! అయిదు, పది పైసల బిళ్ళలు! అందులో కొన్ని జాలితో, కొన్నిఅయిదు పైసలతో స్వర్గం కొనుక్కుందామనే అత్యాశతో. మరికొన్ని రాజమ్మ చినిగిన గుడ్డల్లోంచి కనబడే మురికి ఒంటి సొంపులను చూసే కుళ్ళు మనసుతో!

కారణం ఏదైతేనేం? అవే వాళ్ళకు జీవనాధారం!

కానీ అన్ని రోజులూ అలా గడిస్తే భగవంతుడి గొప్పదనం సమాజ నైజ గుణం ఎలా బయటపడాలి ?

ఓ రోజు రాత్రి అలవాటుగా ఊరంతా తిరిగి రాజమ్మ, నర్సింలు ఊరి చివర వాళ్లు రోజూ తలదాచుకునే చోటు... ఇంకా మరి కొంతమంది తమలాంటి వాళ్లు చేరే చోటు....ఓ పాడుబడ్డ దేవాలయం దగ్గరకు పోతుంటే నిర్జనమైన ఆ దారిలో రాజమ్మకు రాక్షసత్వం అంటే ఏమిటో మొదటిసారిగా తెలిసింది.

శవంతోనైనా సంభోగించే కామాతురులున్న ఈ లోకంలో తనలాంటి ఆడకూతురికున్న రక్షణ ఏమిటో మొట్టమొదటిసారిగా తెలిసివచ్చింది.

ఆ నిర్జనమైన రాత్రి ఆమె అన్యాయంగా బలైపోయింది!

ఒక్కడు కాదు.... ఇద్దరు కాదు.... నలుగురు!

అందరూ దొరబాబులే!

అందరూ కండలు తిరిగిన పచ్చని శరీరంతో కామం ప్రకోపించిన కళ్ళతో ఉన్నవారే!

అందరూ గొంతు నిండుగా మందు సేవించి, నిషా తలకెక్కినవాళ్లే!

అందరూ గొప్పింటి బిడ్డలే!

వాళ్ళల్లో ఎవరెవరు ఏం చేస్తున్నారో ?

ఒక్కడు కాలేజీలో చదువుతూ ఉండవచ్చు. మరొకడు ప్రజల్ని రక్షించాల్సిన బాధ్యతగల ఉద్యోగి కావచ్చు. ఇంకొకడు తరతరాల ఐశ్వర్యాన్ని తగలబెడుతున్న వాడు కావచ్చు!

కాని నర్సింలుకి తెలిసింది ఒకటే! తన తల చిట్లి రక్తం కారటం! రాజమ్మకు తెలిసింది ఒకటే! వాళ్ల చేతుల్లో.... ....

ఆ చిన్న కారు దేవేంద్ర భవనము అయింది. ఆ అభాగ్యురాలి ఆ మురికి శరీరం... రంభో... ఊర్వశో... అయింది. మానం దోచుకున్న వాళ్లకు దేవేంద్రత్వం అబ్బినట్లు అయింది. కారు వెళ్ళిపోయింది.

కాలం గడిచింది.

నర్సింలు గాయం మానింది.

రాజమ్మ జీవించే ఉంది.

కానీ, పాపం పుష్పించింది! పాపం ఫలించింది! అదిగో వాడే ఈ పసికూన! అందుకే నర్సింలుకి ఆ నెలల కూనంటే అంత మంట!

కానీ రాజమ్మకు ? ... ఆమె తల్లి!

వాడు పుట్టకముందే నర్సింలు అన్నాడు. పుట్టిన తర్వాత మరీ గొడవ చేస్తున్నాడు.

"మన మొగాలు సూసి జనాలు పైసలియ్యడం తగ్గించేశారు. ఆ పుట్టబోయే 'పాపానికి'కళ్ళో్, కాళ్ళో్ లేకుండా చేసి తమతో పాటు తిప్పుతుంటే డబ్బులు ఎక్కువొస్తాయే!"

గతంలోంచి ప్రస్తుతం లోకి ఉలిక్కిపడింది రాజమ్మ.

కడుపునిండా పాలు త్రాగి, ఓ చేయి తన రొమ్ము మీద వేసి అలాగే నిద్రలోకి జారిన వాడి ముఖాన్ని తడిమింది.

"ఎంత ముద్దులు మూట గడుతున్నాడు. దొరబాబులాగున్నాడు. అవును మరి! వాళ్లు నలుగురూ దొరబాబులే గదా! వాళ్లలో ఎవడో వీడికి బాబు!"

రాజమ్మకు ఒక్కసారిగా దుఃఖం ముంచుకొచ్చింది. వాడి పుట్టుక ఎలాంటిదైతేనేం? రాజమ్మలో తల్లి ప్రేమ కదిలింది, వీణ్ణి ఎలాగైనా నర్సింలు బారినుంచి కాపాడాలి! లేకపోతే వాడన్నంత పని చేసి తీరుతాడు. కానీ, ఎలా? ఎవరు కాపాడుతారు?

ఆమెకు ఎప్పుడో చూసిన ఓ సినిమా జ్ఞాపకానికొచ్చింది!

అందులో ఓ పెళ్లి కాని అమ్మాయికి ఇలాగే అవుతుంది. కానీ ఆమె రహస్యంగా ఓ బిడ్డను కని, ఆ పసిపాపను నాలుగు రోడ్ల కూడలిలో వదిలేస్తుంది. ఎవరో ధనవంతుడు కారులో అటొచ్చి రోడ్డుకు అడ్డంగా ఉన్న ఆ పాపను చూసి జాలిపడి తనతో పాటు తీసుకొని పోయి సొంత బిడ్డలా పెంచుతాడు.

ఆమె ఆలోచించింది.

అదే బాగున్నట్లనిపించింది.

అంతకన్నా మరో మార్గం కనిపించలేదామెకు!

రేపే ఆ పని చేయాలి. గట్టిగా అనుకుంటూ పిల్లాణ్ణి గుండెలకు అదుముకుంది.

తెల్లారింది.

ఆ రేపు నేడయ్యింది.

అది నాలుగు రోడ్ల కూడలి!

పసికూన.... అందంగా ఉంది! గుక్క పట్టి ఏడుస్తోంది.

దూరంగా చాటునుంచి రెండు కళ్ళు ఆత్రంగా చూస్తున్నాయి! ఎవరైనా పుణ్యం కట్టుకుంటారేమోనని!

ఎండెక్కుతోంది.

గుండె బరువెక్కుతోంది!

పసికూన వెక్కుతోంది!

అదిగో ఎవరో వస్తున్నారు... ఆమెలో ఆత్రుత పెరిగింది. ఆందోళనగా చూస్తోంది! వెళ్ళిపోయాడు.

ఆమెలో నిరాశ గూడుకట్టుకుంది . ఎండ హెచ్చుతుంది! పిల్లాడి లేత ఒళ్ళు వేడెక్కి అలమటిస్తున్నాడు. నెమ్మది నెమ్మదిగా జనసమ్మర్ధం పెరుగుతోంది.

కొందరు చూసి వెళ్ళిపోతున్నారు.

కొందరు ఆగుతున్నారు.

ఆగిన వాళ్లలో మళ్లీ కొందరు వెళ్ళిపోతున్నారు.

కార్లు ఆగుతున్నాయి! కానీ ఎవ్వరూ దిగటం లేదు? దారి చేసుకుని వెళ్ళిపోతున్నారు. ఆమెకు భయమేసింది. ఈ ఎండకు పిల్లాడు చచ్చిపోతాడేమో? ... తను చేసింది మంచి పని కాదేమో? తన ఆలోచన తప్పేమో? .... ఎవరూ ముందుకు రారే ? సినిమాలో అయితే ఆ అమ్మాయి బిడ్డతో పాటు తన నగలు, డబ్బు కూడా పెట్టింది. తనకు కూడా డబ్బుంటే...

ఆమెకు అంత దుఃఖంలోనూ నవ్వొచ్చింది.

తన దగ్గరే డబ్బుంటే తనిలాంటి పనెందుకు చేస్తుందీ? కంటికి రెప్పలా కాచుకునేది.

ఇక లాభం లేదు. తను అనుకున్నట్టు జరిగేట్లు లేదు. తనే వెళ్ళి బిడ్డను తెచ్చేసుకోవాలి. రెండడుగులు ముందుకేసిందామె.

ఇంతలో ఎవరో ఒకతను... పుణ్యాత్ముడు... ఆ పసిబిడ్డను తన చేతిలోకి తీసుకున్నాడు. అందరూ అతని వంక ప్రశంసాత్మకంగా చూస్తున్నారు. ఆమె

త్వరత్వరగా ఆ గుంపు దగ్గరకు పరుగెత్తింది. అప్పటికే అతను ఒక ఆటోను పిలవడం అందులో వెళ్లిపోవడం కనురెప్పపాటులో జరిగిపోయాయి.

ఆమెలోని తల్లి మనస్సు బాధగా ఆక్రోశించింది. అంతలోనే సరిపెట్టుకుంది. అతనికి కారు లేదు. ధనవంతుడు కాకపోవచ్చు. కానీ మనిషి దయ నిండిన తండ్రి లా ఉన్నాడు. అంతే చాలు తనకు! తన దగ్గర కన్నా ఆయన దగ్గర బిడ్డ తప్పకుండా బాగా పెరుగుతాడు. కానీ... కానీ... జీవితంలో తన బిడ్డను ఇక చూడలేనన్న వ్యధను దిగమ్రింగి అక్కడి నుండి కదిలింది రాజమ్మ.

* * *

రాజమ్మ తన పథకాన్ని పాడుచేసినందుకు ఆమెను బండ బూతులు తిట్టాడు నర్సింలు. జుట్టు దొరక పుచ్చుకుని కసిగా గొడ్డును బాదినట్టు బాదాడామెను. అతనికే గనుక చూపుంటే ఇంకా ఎంత పైశాచికంగా ప్రవర్తించే వాడోనని జడుసుకున్నారు తోటి బిచ్చగాళ్లు.

స్పృహ తప్పి పడిపోయింది రాజమ్మ. ఒళ్ళంతా పచ్చి పుండయింది. మూసిన కన్ను తెరవకుండా పడి ఉందామె ఈ నాలుగు రోజులూ! సగం స్పృహలో నిస్త్రాణగా గతాన్ని జ్ఞాపకం చేసికొంటున్న రాజమ్మ నర్సింలు ఘీంకారంతో పూర్తిగా కళ్ళు విప్పి చూసింది.

“యేమే ? ఇట్టా సూడూ!...ఏటి ? నిద్దరోతన్నావా ? మేలుకున్నావా? ఇక మన పంట పండిందిలే! యిదుగో సూడు... ఏటి సేసానో ? ఆ రత్తయ్యగాడ్లేడూ, ఆడి మొగాన ఏడాది నుండి దాసిన ఆ పదేను రూపాయలు పడేసినా! ఆ ..... ఇంక సూడు! ఓ కూనను పట్టేసి మనకిచ్చేసినాడు... యిట్నాడు.... యీడికి కళ్ళులేవు. ఓ సెయ్యి గూడా యిరిసేసినాడు. లెగు...లెగు...ఊళ్ళోకి బేగి పోవాల. నీ బుడ్డోడు కాకుంటే మరోడెవడూ దొరకడనుకున్నావేటే! లెగు.....లెగు.”

తడుముకుంటూ దగ్గరకొచ్చి నేల మీద పడేసాడొక పసిపాపను నర్సింలు... ఆ పసికూన వంక చూసిన రాజమ్మ గుండె బద్దలైంది. ఆమె ఆశల శిఖరాలు

విరిగిపోయాయి. కన్న కలలు చిన్నాభిన్నం అయ్యాయి. ఆమె ఛివాలున వాణ్ని ఒళ్లోకి తీసుకుంది కంపించే చేతులతో.

"వీడు... వీడు.... తన బిడ్డే! అవును.... తన బిడ్డే! ఆ కాలికి ఈ దిష్టి తాడు తనే కట్టింది. మల్లెపువ్వు రేకుల్లాంటి ఆ కళ్ళు ఏమైనాయి? బదులుగా ఆ చోట రెండు ఎర్రని మాంసపు గుంటలు.... పాలు తాగుతూ తన రొమ్మును తడిమే ఈ బుల్లి చేయి, వేలాడి పోతోంది. వెన్నెల నవ్వులను విరజిమ్మే ఆ చివురాకు పెదవులు... నల్లగా కమిలి." ఆమెకు దుఃఖం పొర్లు కొచ్చింది. ఒక్కసారిగా గావుకేక పెట్టి విరుచుకు పడిపోయింది. ఆ తల్లి ప్రేగు తెగిపోయింది.

ఏం జరిగిందీ అర్థం కాక అయోమయంగా నిలబడి పోయాడు నర్సింలు!



("విజయ" మాసపత్రిక సెప్టెంబర్ 1985 సంచికలో)

**మ**నిషయిన ప్రతి వాడికీ ఒక గుండె ఉంటుంది. అలాగే ఒక మనసనేదీ ఉంటుంది. మనసున్న చోట స్పందన, అనుభూతి స్థావరం ఏర్పరచుకోవడం సహజం.

దగాపడ్డ ప్రతివాడూ ప్రతీకారం తీర్చుకోవటానికే ప్రయత్నిస్తాడు. అలా తీర్చుకోలేనంత మాత్రాన అతనికి కసి, ఆవేశం లాంటివి లేవని కానీ, ఒకవేళ ఉన్నప్పటికీ వాటిని అతని అసమర్థత నిర్వీర్యం చేస్తుందని కానీ అనుకోవాల్సిన పనిలేదు.

నిజం చెప్పాలంటే ఏవో యాదృచ్ఛిక సంఘటనల ద్వారానే జీవితంలోని కొన్ని అదృశ్య కోణాలు మనకు అవగాహనకొస్తాయి. నాకు ఉద్యోగం రావటం గనక జరక్కపోతే హైదరాబాద్ వచ్చి ఉండేవాణ్ణే కాదు. హైదరాబాద్ రావటం జరక్కపోతే అరుణాచలం లాంటి వ్యక్తి తటస్థపడటం జరిగి ఉండేది కాదు. వైజాగ్ లో నాలుగేళ్లు కెమిస్ట్రీలో రీసెర్చి చేసి, ఆ వాతావరణంలో ఇంక కొత్తదనం అనుభవించాల్సినదేదీ లేదనే నిర్ధారణకు వచ్చిన రోజుల్లో, ఎప్పుడో సరదాగా అప్లై చేసిన దానికి ఉద్యోగం రావడం, దానికి హైదరాబాదులో పోస్టింగవటం జరిగిపోయాయి. "డాక్టరేట్ సంగతి? గై డెరుగు! గవర్నమెంట్ ఉద్యోగం! గెజిటెడ్ పోస్టు! మూడు ఇంక్రిమెంట్లు ఆరు డి.ఏ.ల్లా హాయిగా ఉద్యోగం చేసుకో!" అన్న ఫ్రెండ్స్ (మ) హితోక్తులను పాటించి భాగ్యనగరం ఛలో అన్నాను. ట్రైన్ ఎక్కేదాక నాకు హైదరాబాద్ కానీ, అక్కడ అరుణాచలం లాంటి ఒక వ్యక్తి ఉంటాడని, నా



అనుభవాల్లో ప్రముఖ స్థానం వహించబోతాడని కానీ నాకు తెలియనే తెలీదు. మన కళ్ళ ఎదుట నిత్యం తారసిల్లే సర్వసాధారణ జీవితాల్లోనే మనం అనుకోని వ్యక్తిత్వాలు ఉంటాయనటానికి అరుణాచలం ఒక చక్కని ఎగ్జాంపుల్.

అరుణాచలం పూర్తి పేరు అరుణాచల రమణ. కొన్ని పేర్లు మనకు చాలా అరుదుగా కనిపిస్తుంటాయి. కానీ బహు ఆకర్షణీయంగా ఉంటాయి. అందుకే మా డైరెక్టర్ 'ఇంటర్ కం'లో పిలవటానికీ, అతను రావటానికీ మధ్య నా ఆలోచనలు నాకు తెలియకుండానే ఆ పేరుకు ఒక ఆకృతిని కలిగించటానికి ప్రయత్నించాయి. నా చిన్నప్పుడు, అంటే ఇంకా చదవటం, రాయడం రానప్పుడు, కేవలం బొమ్మల పుస్తకాల్నే కళ్ళతో చదువుకుంటున్న రోజుల్లో, యుద్ధం చేస్తున్న రావణాసురుడి బొమ్మను చూసి రాముడంటే అతనే అనుకునేవాణ్ణి కొంతకాలం! అందుకు కేవలం ఆ వయస్సున్నప్పుడే నాలో పొటమరించిన హేతువాద లక్షణాలు కారణమని నేను ఇప్పటికీ అనుకుంటూ ఉంటాను. ఆరు తలలున్న కుమారస్వామి, నాలుగు తలలున్న బ్రహ్మల లాగానే పది తలలు ఉన్న వాడే దేవుడని, దేవుడైన రాముడని, నేను ఊహించబోవడమే అందుకు కారణం! ఆ వయసులో అలా ఊహించడంలో తప్పులేదేమో కానీ అరుణాచలం గురించి మళ్ళా అలాంటి ఊహలే చేసి ఆ తరువాత సిగ్గుపడాల్సి రావటం ఇప్పుడు నా విషయంలో నాకే చిన్నతనం అనిపించింది.

స్వింగ్ డోర్ ను తోసుకొని లోపలికి వచ్చిన అరుణాచల రమణ నా వంక చూడకుండానే సూటిగా డైరెక్టర్ కు విష్ చేసి నిలబడ్డాడు. సన్నగా, బక్కపలచగా, పొడుగ్గా, నల్లగా, వేళ్ళాడి పోతున్న చొక్కా, ఫోల్డింగ్ ఉందో లేదో తెలీని పాంట్, పొడుగు ముక్కు, వెడల్పాటి చెక్కిళ్ళు, ముందుకు పొడుచుకు వచ్చినట్లుండే గడ్డం, ఇదీ సంక్షిప్తంగా అరుణాచలం! ఇంకా అతన్ని పరిశీలిస్తూండగానే ....

"ఇతను అరుణాచల రమణ. ఇక్కడ కెమిస్టు మీలాగానే. మీ యూనిట్ ఇంచార్జి మూర్తి గారు ప్రస్తుతం లీవ్‌లో ఉన్నారు. మీరు లాబ్‌లో అలవాటు పడేవరకు, అరుణాచలం విల్ అసిస్ట్ యూ! హి యీజ్ సింప్లీ యాన్ ఎక్స్పర్ట్ ఇన్ ఎవ్రీథింగ్" అని అతన్ని పరిచయం చేయడం అయిపోయాక "మీట్ మిస్టర్ రావ్"

అని నన్ను కూడా పరిచయం చేసి చేతులు దులుపుకుని "ఓ.కే. క్యారీ ఆన్" అనేశాడు మా డైరెక్టర్. నేను లేచి నిలబడ్డాను షేక్ హ్యాండ్ ఇద్దామని. కానీ అప్పటికే అరుణాచలం బయటకి వెళ్లి పోవడం జరిగిపోయి నిర్ఘాంత పోయాను నేను. నాకెందుకో కొంచెం చిరాగ్గా అనిపించింది. ఉద్యోగంలో చేరుతూనే ఇలాంటి అనుభవాన్ని ఎదుర్కొన్నందుకు. ఏమిటీ వ్యక్తి? అనిపించింది. అతని స్వభావమా?.... నిర్లక్ష్యమా ? ఇలాంటి వ్యక్తి తో వ్యవహరించటం నాకు ఇంతకు ముందెన్నడూ అనుభవంలో లేని విషయం! అయితే నా ప్రవృత్తిరీత్యా నాకీ విషయం కొంత ఆసక్తిగా కూడా అనిపించింది. నాకు సైకలాజికల్ స్టడీ ఒక హాబీ! నిజానికది రచనల విషయం లోనే కాక జీవితంలోనూ ఎంతో కొంత నాకు ఉపయోగ పడుతూ వచ్చింది. లేకపోతే యూనివర్సిటీలో చదువు, రీసెర్చ్ లాంటి వాటికి ఎప్పుడో తిలోదకాలివ్వవలసి వచ్చేది! అంతేకాక నేను బాగా మాట్లాడగలనని, ఇతరులను ఆకట్టుకోగలనని నామీద నాకు గుడ్డిదో, మెల్లదో ఒక నమ్మకం! ఎలాంటి తరహా మనిషితో నైనా సాన్నిహిత్యం ఏర్పరుచుకోగలననే విశ్వాసం నాకుంది. ఇన్ని కారణాల



వలన ఈ అరుణాచలం విషయం ఏమిటో ఆసాంతం పరిశీలిద్దామన్న ఉబలాటం కలిగింది నాకు.

అయితే నా ఉత్సాహం నీరుకారి పోవటానికి ఎంతో కాలం పట్టలేదు. అతను నా విషయంలో బొత్తిగా ఆసక్తి చూపలేదు సరి కదా! తన విషయంలో నాకూ ఏమాత్రం అవకాశం ఇవ్వలేదు. ఉద్యోగంలో జాయిన్ అయి ఒక సంవత్సరం అయినా గొంగళి వేసిన చోటే ఉంది.

అరుణాచలం మితభాషి. ఎప్పుడూ ఏదో పోగొట్టుకున్న వాడిలా దైన్యం మూర్తీభవించిన ముఖంతో ఉండేవాడు. అవసరం అయినంత మేరకు ముక్తసరిగా మాట్లాడుతాడు. అది కూడా లాబ్‌లో పని, ఆఫీసు విషయాలకు సంబంధించినంత మేరకే! ఏ ఫంక్షన్లకీ అతను వచ్చే వాడు కాదు. అంతేగాక నాకు వింతగా అనిపించింది. అతని రాకపోకలను గురించి ఎవరూ పట్టించుకోకపోవటం! బార్లూ, హోటళ్లూ, సినిమాలు, క్రికెట్టు వీటి గురించి అతనికి తెలుసో లేదో నాకు తెలియదు. అసలు ఈ లౌకిక ప్రపంచంతో సంబంధం ఉన్నట్లే ప్రవర్తించేవాడు కాదు. ఒకళ్ళిద్దరు అతనంటే వేళాకోళంగా మాట్లాడటం నేను గమనించినా, మొత్తం మీద మా లాబ్ లో అందరికీ అతనంటే గౌరవం కొంతయినా ఉండడం మాత్రం నేను తెలుసుకున్న నిజం. దానికి కారణం అతను వర్క్ విషయంలో మంచి ఎక్స్పర్ట్ కావటమే అని నాకు తెలుసు.

ఇద్దరు వ్యక్తుల నడుమ స్నేహం ఏర్పడాలన్నా, అభివృద్ధి పొందాలన్నా కొన్ని అభిరుచులు కామన్‌గా ఉండాలి! కొన్ని అభిప్రాయాలు ఏకీభవించాలి. జరిగిన సంవత్సరం కాలంలో అలాంటిది ఒక్కటైనా నేను కనుక్కోలేక పోయి చేతులెత్తేసిన తరుణంలో ఒక చిన్న సంఘటన జరగడం, అది క్రమంగా మా ఇద్దరి నడుమ అనుకోని విధంగా సాన్నిహిత్యం ఏర్పడడానికి దోహదపడటం జరిగింది. ఆ సంఘటన, ఓ పత్రిక నిర్వహించిన పోటీల్లో నా కథకు తృతీయ బహుమతి వచ్చి, నా పరిచయం ఫోటోతో సహా ప్రచురింపబడటం! అయితే ఆ విషయం మా ఆఫీస్‌లో మిగతా వారెవరూ గమనించక పోయినా అరుణాచలం మాత్రం

తనంతట తాను నా వద్దకు వచ్చి అభినందించడం నాకు ఆనందంతో పాటు విస్మయాన్ని కూడా కలిగించింది. అరుణాచలం లాంటి వ్యక్తికి ఇలాంటి ఇంట్రెస్టు ఉంటుందని నేను కలలో కూడా ఊహించలేకపోవడమే అందుకు కారణం.

ఎదురు చూస్తున్న తీగ కాలికి తగిలినట్లయింది. ఈ అవకాశాన్ని జారవిడుచుకోలేదు నేను. ఫలితంగా మా ఇద్దరి మధ్య కొద్ది కాలంలోనే స్నేహం పెరిగింది. కానీ ఐదేళ్లయినా అది ఒక పరిధి దాటక పోవడం నేను గమనించవలసి వచ్చింది. మా మాటలూ, చేతలూ, చర్చలు అన్నీ ఆఫీసు వరకే పరిమితం అయిపోయాయి. అతనెప్పుడూ నన్ను తన ఇంటికి ఆహ్వానించలేదు. లేదా తను మా ఇంటికి రాలేదు. తన వ్యక్తిగత జీవితం చీకటిలోనే ఉండిపోయింది. అతను ఇలా ఎందుకు అందరి నుంచి దూరంగా ఉంటున్నాడో నాకు అంతుపట్టలేదు. కానీ ఉన్నంతలో నా ఒక్కడితోనే దగ్గరగా మసులుతున్నాడని నాకే గాక మా ఆఫీసులో మిగతా వాళ్లకూ తెలుసు. అందుకే, ఆ రహస్యాన్ని భేదించాలని నేను అప్పుడప్పుడూ అనుకున్నప్పటికీ ఆ కారణంగా మా మధ్య ఏర్పడిన ఈ కాస్త సాన్నిహిత్యాన్నీ చెడగొట్టుకోవటం నాకు ఇష్టం లేకపోయింది. అందుకే అవకాశం కోసం ఎదురు చూడడం మినహా మరేమీ చేయలేక మిన్నకుండిపోయాను.

ఇంతలో నాకు మద్రాస్‌కు ట్రాన్స్ఫర్ అవ్వడం జరిగింది. వీడ్కోలు పార్టీ అయిపోయిన తర్వాత అరుణాచలం అన్నాడు... "మాస్టారూ! మీకు నేను మరో ప్రత్యేక పార్టీ ఇవ్వదల్చుకున్నాను. సాయంత్రం రెడీగా ఉండండి" అని. అరుణాచలం పార్టీ ఇస్తాను అనడం ఒక ఆశ్చర్యం అయితే, అది మందు పార్టీ కావడం మరో వింత! అప్పుడు తెరిచాడు అరుణాచలం తన బతుకు పుస్తకం. "మాస్టారూ! మీ మనసులో చాలా కాలంగా ఉన్న కోరిక నాకు తెలుసు. నా కథ తెలుసుకోవాలని", అంటూ చెప్పిన అతని కథంతా విన్నాక నాకనిపించింది... అరుణాచలానికీ, నాకూ మధ్య ఏర్పడ్డ స్నేహం నేను అనుకున్న దానికన్నా ఎన్నో రెట్లు అధికంగా, ప్రాణప్రదంగా భావిస్తున్నాడని. అతని సాంసారిక రహస్యాన్ని నాతో చెప్పడమే అందుకు తిరుగులేని నిదర్శనం!

అరుణాచలం అందగాడు కాదు. ఆస్తిపాస్తులున్నవాడు అసలే కాదు. కానీ తల్లిదండ్రులు కట్నం ఇవ్వలేని కారణంగా అరుణాచలానికి అందమైన జీవిత భాగస్వామిని అమరింది. అరుణాచలం అందగాడు కాకపోవచ్చు కానీ అతని హృదయంలో ఎంతో భావుకత ఉన్నవాడు. అమృతాన్ని తన హృదయంలో నింపి తన భార్యకు అందించాడు. ఆమెను సుఖపెట్టాలని తపించాడు. ఆమెను పూర్వ జన్మలోని అదృష్టంగా తలపోసాడు. కానీ భౌతిక సుఖవాంఛల్నే ఉత్కృష్టంగా భావించే ఆమె అతని స్వప్నాల్ని నేలరాచింది. అతని అభిమానాన్ని, ఆదరణనూ తుత్తునియలు చేసింది. సంసారంలో సుఖం అనేది లేకుండా చేసింది. అంతలో తారసపడ్డాడామెకు తన కాలేజీ రోజుల్లోని మాజీ ప్రియుడు. అతనూ, ఆమె వాళ్ల సంబంధం అరుణాచలం కళ్ళముందే నిరాఘాటంగా విచ్చలవిడిగా సాగిపోతోంది! అరుణాచలం అతన్ని ఏమీ చేయలేక పోయాడు. అతని ఆస్తి, ఐశ్వర్యం, రూపం, రౌడీయిజం అరుణాచలాన్ని అసమర్థుణ్ణి చేశాయి.

ఇదీ అరుణాచలం భగ్న జీవితం! కానీ ఇంత జరిగినప్పటికీ అతను ఆమెను ఇంకా ప్రేమిస్తూనే ఉన్నాడు! ఎప్పటికైనా ఆమె తనను అర్థం చేసుకుంటుందనే అతని ఆశ. ఏవో సాంత్వన వచనాలు పలకటం తప్ప నేను అరుణాచలానికి ఏమి చేయగలను ?

కాలగర్భంలో మరో పదేళ్లు గడిచాయి. మళ్లీ నాకు హైదరాబాదుకు ట్రాన్స్ఫర్ అయింది. ఈ మధ్యకాలంలో నేనెప్పుడూ అరుణాచలాన్ని చూడడం తటస్థించలేదు. అతను హైదరాబాద్లోనే స్థిరంగా ఉండిపోయాడు. రెండేళ్ల క్రితం అరుణాచలం భార్య లుకేమియాతో అరుణాచలాన్ని భౌతికంగా కూడా ఒంటరివాణ్ణి చేసి వెళ్లిపోయిందని అరుణాచలం రాసిన ఒక ఉత్తరం ద్వారా తెలిసింది. అంతే! ఇంతకాలానికి మళ్లీ ఇదే అరుణాచలాన్ని చూడడం. తను స్టేషన్కు వచ్చి నన్ను వాళ్ల ఇంటికి తీసుకుపోయాడు బలవంతంగా. "మాస్టారూ! మీరు యివాళల్లా రెస్ట్ తీసుకోండి. రేపు డ్యూటీలో జాయిన్ అవ్వవచ్చు. సాయంత్రం మిమ్మల్ని ఒక చోటుకు తీసుకెళ్లాలి!" అని నన్ను సస్పెన్స్ లో ఉంచి తను ఆఫీసుకు వెళ్లిపోయాడు.

ఆ సాయంత్రం వెళ్ళాం మేమిద్దరం! ఎవరిదగ్గరకో కాదు! అరుణాచలం జీవితం చిన్నాభిన్నం కావడానికి కారణమైన వ్యక్తి. అరుణాచలం భార్య మాజీ ప్రియుడు. అతనిప్పుడు మంచంలో ఉన్నాడు. చిక్కి శల్యమై దయనీయమైన స్థితిలో ఒంటరిగా, ఆలనా పాలనా చూసే దిక్కు లేకుండా, నిస్సహాయ స్థితిలో ఉన్నాడు. అప్పటికే రెండుసార్లు "హార్ట్ ఎటాక్" వచ్చిందట. మరో సారి వస్తే అదే ఆఖరి సారి అని డాక్టర్లు హెచ్చరించారట! అరుణాచలం అతని దగ్గర కూర్చుని ఆత్మీయంగా, ఆర్ద్రంగా పరామర్శిస్తుంటే నాకు విస్మయం అనిపించింది! అతని మీద నాకున్న అభిమానం మరింత పెరిగింది. ఆ వాతావరణంలో ఉండలేక గది గుమ్మం బయటకు వచ్చి సిగరెట్ వెలిగించాను. అతనేదో ఆయాసపడుతూ అంటున్నాడు. చెవులు రిక్కించి వినసాగాను.

"అరుణాచలం! నీకు ఘోరమైన అన్యాయం చేశాను. అతి హేయంగా ప్రవర్తించాను. అయినా ఈనాడు నువ్వు నన్ను ఇలా పరామర్శించడానికి వచ్చావంటే నమ్మలేకుండా ఉన్నాను! నామీద నీకు నిజంగా కోపం లేదా!"

బదులుగా అరుణాచలం చిన్నగా నవ్వి అన్నాడు.

"నిజమే! కొంతకాలం కోపంగా ఉండేది. కానీ తర్వాత లేదు."

"ఏం ?"

"నువ్వెప్పుడన్నా మీ రెండో కుర్రాణ్ణి జాగ్రత్తగా గమనించావా ?"

"అంతగా లేదు అరుణాచలం! వాడు పసివాడుగా ఉండగానే ఆమె పిల్లలతో సహా పుట్టింటికి వెళ్లిపోయింది! చివరకు నేనిలా ఉన్నా ఆమె రాలేదంటే నేనంటే ఎంత అసహ్యమో!" అని, కాసేపాగి "అయితే ?" అన్నాడతను.

"ఏమీ లేదు!" నిటారుగా కూర్చుని అన్నాడు అరుణాచలం నింపాదిగా... "జాగ్రత్తగా పరికిస్తే వాడిలో నా పోలికలు తేలిగ్గా కనిపించి ఉండేవి!"

నా నోట్లోని సిగరెట్ జారి పడిపోయింది.

ఒక్క క్షణం అరుణాచలం ఏం అన్నాడో నాకు అర్థం కాలేదు. అర్థం అయిన తర్వాత నిశ్చేష్టుణ్ణయ్యాను.

"నేన్నమ్మను!" ఒక్కసారి ఆవేశంగా అరిచాడతను. అరుణాచలం లేచి అన్నాడు.

"నాకు తెలుసు! నిజం ఎప్పుడూ అలాగే ఉంటుంది. ఎక్కువగా ఆలోచించి మనసు పాడు చేసుకోకండి. గతం గతః మళ్లీ వస్తాను."

అరుణాచలం బయటకు వచ్చాడు. దారిలో మేమిద్దరం ఏమీ మాట్లాడుకోలేదు. విన్న విషయాన్ని జీర్ణం చేసుకోవడానికి ప్రయత్నిస్తున్నాను నేను.

ఆ మర్నాడు లాబ్ లో పని చేసుకుంటుంటే అరుణాచలం నా దగ్గరకు వచ్చాడు. ఏమిటన్నట్లు అతని వైపు చూశాను. నెమ్మదిగా అన్నాడు.

"అతను చచ్చిపోయాడు! రాత్రి మళ్లీ అటాక్ వచ్చిందట ." ఆ మాటలు చెప్తున్నప్పుడు అరుణాచలం ముఖంలో ఏదో తృప్తి, విజయగర్వం కనిపించాయి నాకు. అతనిలో నాకు తెలియని కొత్త వ్యక్తిని చూస్తున్నట్లు అనిపించింది. అతని వైపు వెర్రిగా చూస్తూ ఉండిపోయాను.

అరుణాచలం కదలబోయాడు. తేరుకుని ఆతృతగా అడిగానతన్ని.

"నిన్న.... నిన్న..... నువ్వు అతనితో చెప్పింది నిజమేనా ?"

ఒక నిమిషం మౌనంగా ఉండిపోయాడతను. నేను క్షణక్షణానికి పెరుగుతున్న ఆత్రుతతో అతని సమాధానం కోసం ఎదురు చూస్తున్నాను.

"నిజం చెప్పాలంటే ఆమెను నేనెప్పుడూ చూడలేదు!" అతను సమాధానం చెప్తున్న తీరు 'నా గురించి నీకు ఇంతేనా తెలుసు!' అన్నట్లున్నది .

సమాధానం చెప్పి వెళ్ళిపోతున్న అరుణాచలాన్ని చూస్తుంటే నాకు ఏదో అర్థమయినట్లనిపించింది. చాలా కాలంగా నాకున్న సందేహానికి సమాధానం దొరికినట్లనిపించింది . 'శవ ప్రాయంగా ఉన్న ద్రోణుణ్ణి ధృష్టద్యుమ్నుడు ఎందుకు అంత క్రూరంగా చంపాడో!' తెలిసిందనిపించింది.



(6.5.1983 ఆంధ్రజ్యోతి సంచికలో. ఉగాది కథానికల పోటీలో కన్సొలేషన్ బహుమతి)

# పునరపి చలనం




గవర్రాజు నాకున్న ఒక్కగానొక్క స్నేహితుడు. ఆ విషయం ఎన్నడూ పైకి అనకపోయినా, చెప్పటానికి నాకేమీ అభ్యంతరం లేదు! అందుకే వాడికి హైదరాబాదులో ఉద్యోగం వచ్చిందని తెలియగానే నేను సహజంగానే చాలా సంతోషించాను.

గవర్రాజు వస్తూ వస్తూనే కొన్ని సమస్యల్ని పట్టుకొచ్చాడు. అసలు వాడితో నాకున్న పేచీ ఇదొక్కటే, మనిషికి లౌక్యం తెలియదు. "అసమర్థస్య సాధూనాం...." అన్నట్టు గవర్రాజులోని మంచితనమే అలా చేసిందో లేక అలా ఉండటం వల్లే వాడు మంచివాడయ్యాడో నాకు ఇప్పటికీ అర్థం కాని విషయం. అయితే గవర్రాజు 'రాక'కు నేను 'ఆల్రెడీ' సంతోషించేశాను కాబట్టి, చేసేదేమీలేక పూర్వంలో లాగానే అతని సమస్యల్ని నెత్తినేసుకొన్నాను.

---

**కవితా ప్రసాద్**

"నాకు జీతం వచ్చేందుకు మూడు నెలలు పడుతుందట!" అన్నాడు బిక్క మొగంతో.

"ఇందులో పెద్ద సమస్యేముంది. నీకు ఎంత కావాలంటే అంత నా దగ్గర నుంచి వాడుకో !" అన్నాను.

"అది సరే ! నాకు ముందో 'రూం' కావాలి !" అన్నాడు ఆ తర్వాత.

"ఉన్నట్లుండి హైదరాబాద్ లాంటి మహానగరంలో రూం కావాలంటే ఎట్లా....? సరేలేరా! వెదుకుదాం!" అన్నాను.

అన్నట్లే... మా మావయ్య స్కూటర్ అప్పు తీసుకొని, పెట్రోల్ పోయించి (అప్పు ఇవ్వరు కదా!) ఓ శనివారం ఉదయాన్నే 'రూము వేట'కు బయలుదేరాం.

"పెళ్లయిందా ?" అని అడిగేవాడే తప్ప , ' రూమిస్తాం' అన్న వాడు ఒక్కడూ కనిపించలేదు.

"ఇప్పుడు 'రూం కోసం' అంత అర్జెంటుగా పెళ్లెక్కడ చేసుకోనూ" అని మావాడు దిగులు పడసాగాడు.

ఏమైతేనేం ఓ పది రోజులు 'నాంపల్లి' నుంచి 'తార్నాకా' దాకా గాలిస్తే.... చివరకు 'వారాసిగూడా'లో ఓ పుణ్యాత్ముడింట్లో రూముందని తెలిసింది. ఇద్దరం ఆయన్ని దర్శించి రూమర్థించాం.

ఇంటాయన పెట్టిన ప్రతి కండిషన్‌కూ... మా వాడు తల ఊపాడు. మొహమాటం లేకుండా చెప్పాలంటే, బలవంతంగా తల ఊపించాను.

ఆ తర్వాత తీరిగ్గా ఆయన తన కష్టాలన్నీ ఏకరువు పెట్టసాగాడు. "తాను బీపి ఎక్కువ మనిషట! ఎక్కడలేని డబ్బూ వైద్యానికే చాలక ఇల్లంతా అద్దెకిచ్చి తనూ, ముసలావిడా బయట వరండాలో ఉంటున్నార్ట. మరంచేత అద్దె డబ్బులు ఠంచనుగా ఫస్ట్ కల్లా యిచ్చేయాల్ట!"

అంతా విని సానుభూతి చూపుతూ, "అదీ మంచిదే లెండి! హై బీపీ వాళ్ళు బయట ఉండడమే మంచిది!" అన్నాడు గవర్రాజు.

పాపం ! గవర్రాజుకి నిజంగానే జోకు వేయడం రాదు. కానీ ఆ విషయం ఆయనకు తెలియక పోవడం వలన మేము సెలవు పుచ్చుకోవాల్సి వచ్చింది.

చివరికెలా అయితేనేం.... అష్ట కష్టాలంటారే... అవేవో పడి , గవర్రాజును బర్కత్పురాలో "ఓ రూము వాణ్ణి" చేశాను.

కానీ పదిహేను రోజులైనా కూడా కాకుండానే, గవర్రాజు సరాసరి మా ఆఫీసుకు వచ్చేసి, 'రూమ్ మార్చేయాల'న్నాడు .

నేను ముందు కొంచెం విస్తుపోయాను. ఆ తర్వాత మరికొంచెం కలవర పడ్డాను.

"ఇంతకీ నీకా రూంలో ఏం నచ్చలేదు?" నిలదీశాను వాణ్ణి.

"ఆ ఇంటి వాళ్లకున్న ఒకే ఒక కుక్క రాత్రింబవళ్లూ అరుస్తూ ఉంటుందట! ఈగను చూసినా... ఏనుగును చూసినా, అది అరవకుండా ఉండలేదట. అందుకని తనకు ప్రశాంతంగా ఉండే మరో రూం చూసి పెట్టాలట!" కొంచెం బతిమిలాడుతున్నట్లుగానే అన్నాడు.

తప్పేదేముంది? మళ్లీ స్కూటర్ టైర్లరిగేలా తిరిగి ఇంకో రూం చూసి పెట్టాను.

నెల రోజులు కాగానే మళ్లీ పాత పాటే మొదలుపెట్టాడు.

"ఈ సారేం వచ్చిందన్నాను?"

"ఆ ఇంటావిడకూ, అద్దెకున్న మరొకళ్లకూ, ఏవో తగూలున్నాయట. దాంతో అస్తమానమూ వాళ్లు పోట్లాడుకుంటూ ఉంటారు. వాళ్ల పోట్లాటలేమో గాని మధ్యలో నేను చచ్చి పోతున్నాను! ఒరేయ్! నీకు పుణ్యం ఉంటుంది... నాకు ఇంకో రూం చూసి పెట్టరా!" నా చేతులు పట్టుకున్నాడు.

మొత్తం మీద గవర్రాజు కోసం నేనలా... అలా... చాలాసార్లు కష్టపడాల్సి వచ్చింది. ఓసారి... పక్క వాళ్ళ రేడియో బ్రాండ్ మంచిది కాదనీ, అది ఎప్పుడూ

మోగుతూంటుందని, మరోసారి మరోటనీ ... అలా గవ్రాజు హైదరాబాద్ వచ్చిన ఎనిమిది నెలల్లోనూ, ఐదు రూముల్ని మార్చేశాడు.

ఉన్నట్లుండి ఓ రోజున మిట్టమధ్యాహ్నం చెమటలు కార్చుకుంటూ మా ఆఫీసుకు వచ్చాడు గవ్రాజు.

కాసేపు ఆ మాటా... ఈ మాటా మాట్లాడి చివరికి నేను భయపడినట్లుగానే, "రూం ఖాళీ చెయ్యాలి రా" అంటూ నసిగాడు.

నాకు నిజంగానే కోపం వచ్చింది.

కాకపోతే ఈసారి వాడికి రూం అక్కర్లేదట! ఓ ఫ్యామిలీ పోర్షన్ కావాలట! దానికి కారణం ఇంకో నెల రోజుల్లో వాడి పెళ్లికి ముహూర్తం నిశ్చయం కావడమే! గవ్రాజుకి పెళ్లని తెలియగానే నాకు చాలా ఆనందం వేసింది. కంగ్రాచ్యులేషన్స్ చెప్పాను. దాంతోపాటే మొహమాటం వదిలి పెట్టి "ఇదివరలో రూములు మార్చినట్టు మళ్లీ... మళ్లీ ఫ్యామిలీ పోర్షన్లు కూడా మారిస్తే.. ఇక నా వల్ల కాద"ని తెగేసి చెప్పేశాను.

గవ్రాజు కొంచెం చిన్నబుచ్చుకున్నప్పటికీ తలూపాడు.

మొత్తానికి పెళ్లి అయిన పదహారు రోజుల కల్లా, ఓ శుభదినాన, వాడిని సతీ సమేతంగా ఓ మంచి పోర్షన్లో దింపి నేను చేతులు దులుపుకొన్నాను.

తర్వాత వాడిని చూసి రావాలనుకుంటునే... కొన్నాళ్లు ఆఫీసులో పని ఒత్తిడి వల్ల, మరి కొన్నాళ్ళు మా మామయ్య కూతురి పెళ్లి హడావిడితోనూ కలవడానికి వీలుపడలేదు.

అయితే ఒకరోజు నల్లకుంట కూరల మార్కెట్లో గవ్రాజే యాదృచ్ఛికంగా కనిపించాడు. గడ్డం పెరిగి మనిషి నీరసంగా కనిపిస్తున్నాడు.

సైకిల్ మీద నుంచి దిగి పలకరించాడు. వాడి అవతారం చూసి నేను కొద్దిగా కంగారుపడ్డాను.

"ఏమిటిలా ఉన్నావ్?" అన్నాను.

మాట్లాడలేదు వాడు.

"సంగతేమిట"ని రెట్టించాను.

"పది రోజులుగా మరో ఇల్లు కోసం వెతుకుతున్నాను !

నీ దగ్గరకు వచ్చి ఈ విషయం చెప్పడానికి నాకు మొహం చెల్లలేదు. నిజంగా ఇల్లు దొరకడం చాలా కష్టంగా ఉంది" అంటూ చాలా ఫీలవుతూ కన్నీళ్లు పెట్టుకున్నాడు గవర్రాజు.

చెప్పొద్దూ! నాకు మహా చిరాకేసింది. ఇక వీణ్ణి ఆ దేవుడు కూడా మార్చలేడు అనుకున్నాను. అయినా సహజమైన కుతూహలం ఆపుకోలేక "ఈసారేమయింది?" అడిగాను వాణ్ని !

వాడు ఒక్క క్షణం ఆగి "మా ఇంటాయనే ఖాళీ చేయమన్నాడు!" అన్నాడు.

"ఓ! రివర్స్ అయిందే!" వాడి మాటలకు ఆశ్చర్యపోతూ, నాకు తెలియకుండానే పైకి అనేసాను.

వాడు ఏం మాట్లాడలేదు.

"ఏం ? ఎందుకనిట?" కూపీ తీయబోయాను.

"ఆ... ఏం లేదు! కారణం ఏమైనా ఈ నెలాఖరులోపు ఖాళీ చేయాలి! ఎక్కడన్నా నీకు తెలిసిన పోర్షన్లు ఉంటే చెప్పు! మళ్లీ ఆఫీస్లో కలుస్తాను!" అంటూ హడావిడిగా వెళ్ళిపోబోయాడు.

వాడి భుజం పట్టుకుని ఆపి, "అసలిప్పుడు ఇల్లెందుకు ఖాళీ చేయాల్సి వచ్చిందో చెప్పు! మళ్లీ చూసే పోర్షన్కు ఆ ఇబ్బంది ఉండకుండా చూడాలి కదా!" విసుగ్గా అడిగాను.

ఇక చెప్పక తప్పలేదు గవర్రాజుకి.

నాకు మొహం చూపించలేక ఎదురుగా ఉన్న సినిమా పోస్టర్ ను చూస్తూ "ఏం లేదురా మీ చెల్లెలికి కాస్త సినిమా పాటలంటే ఇష్టం, అప్పుడప్పుడూ ఆమె తీసే కూనిరాగాలకు మా ఇంటి ఓనర్‌కు హార్ట్ ఎటాక్ వచ్చిందట! ఇక తాను ఆ 'రాగాల్ని' భరించలేననీ, వెంటనే ఇల్లు ఖాళీ చేసేయమని ఖచ్చితంగా చెప్పేశాడు!" అని సైకిల్ ఎక్కాడు గవర్రాజు.

వాడి మాటలకు అదిరి పడ్డాను.

మరోసారి కష్టపడి, ఎలాగోలా ప్రస్తుతం ఉన్న ఇంటి ఓనర్‌ని కాపాడగలనేమోగానీ.... మరి గవర్రాజు... ఎప్పుడూ ప్రశాంతత కోసం ఆరాటపడే గవర్రాజుని... నేనెలా కాపాడగలను? పాపం.... పూర్ ఫెలో!!



("ఆంధ్ర సచిత్ర వారపత్రిక" 3.9.1982 వినాయక చవితి సంచిక)

# వర్షంలో అప్సరస



శుక్రవారం కాబోలు, పేరంటానికి వెళ్తున్న ఆడవాళ్ళు రంగురంగుల చీరలతో, పసుపు పాదాలతో, నిండయిన పూల కొప్పులతో సందడి సందడిగా ఉంది వీధి. వాకిట్లో వరండా స్తంభాన్ని ఆనుకొని సిగరెట్ వెలిగించాను. ఆకాశంలో శ్రావణ మేఘాలు దట్టంగా ముసురుకున్నాయి. పేరంటాళ్ళ సందడిని చూడడానికన్నట్టు. గాలిలో మట్టి వాసన తగులుతోంది! అంటే ఎక్కడో వర్షం ప్రారంభమైందన్నమాట! అసలు వర్షం అంటే నాకు చిన్నప్పటినుండి ఎంతో ఇష్టం. అలా ఎంతసేపైనా కురిసే వర్షాన్ని చూస్తూ ఉండి పోగలను.

టపటప.... ట ప ట ప... చూస్తూండగానే పెద్దపెద్ద చినుకులు పడసాగాయి. ఒకటి గాలివాటుకు నా మీద పడింది. ఒళ్ళు పులకరించినట్లయింది. క్రమంగా వర్షం పెద్దదయింది. చిన్నచిన్న తుంపరలు దారి తప్పి నా మీద పడుతూనే ఉన్నాయి. అయినా ఆ ఆహ్లాదాన్ని అనుభవిస్తూ అక్కడే నుంచున్నా. తాపీగా నడుస్తూ , ఊసులాడు కుంటూ పేరంటానికి వెళ్తూ ఒక్కసారిగా వచ్చిపడిన వానలో తడుస్తూ ఎక్కడ ఎక్కడ తలదాచుకునే వరండాలు కనిపిస్తే అక్కడక్కడ ఆడవాళ్ళు దూరిపోతున్నారు.

వర్షం జోరు పెరిగింది. ఆ చల్లని సాయం వాతావరణం, పీలుస్తున్న వెచ్చని సిగరెట్ పొగ, గుండెలోతుల్లో ఏదో గుబులు, వింత ఆలోచనలను రేకెత్తిస్తున్నాయి. కళ్ళు మూసుకుని ఆలోచనలతో ఏవేవో లోకాల్లో విహరిస్తున్న నేను ఏదో అలికిడికి ఉలిక్కిపడి కళ్ళు తెరిచాను. ఎదురుగా, ఎట్టెదుటగా, అందం రాశీభూతమైనట్లు వెన్నెలకు విగ్రహాకృతి వచ్చినట్లు తడిసిన తాజా గులాబిలా, మందహాసం వెలయిస్తున్న మల్లెలా... ఆమె... ఎప్పుడు వచ్చిందో నేను గమనించలేదు.

చీర, జాకెట్టు పూర్తిగా తడిసి ఒంటిని పెనవేసుకున్నట్లుగా ఉన్నాయి. అదుపుతప్పిన నల్లని ముంగురులు పచ్చని ఫాల భాగంపై అతుక్కుపోయి ఉన్నాయి. కురుల నుంచి చిన్న చిన్న నీటి చుక్కలు పక్కలనుంచి ఆమె నునుపైన చెక్కిళ్ళ మీద జారిపోతున్నాయి. వర్షానికి కరిగిన బొట్టు నుదుటి మీది నుంచి కనుబొమ్మల మధ్యగా నాసిక మీదకు జారి వింతగా ప్రకాశిస్తోంది. ఆ సోయగం నన్ను వివశుణ్ణి చేస్తుంటే, మిలమిల మెరిసే ఆమె విశాలనేత్రాల్లోకి చూశాను. ఆ సోగ కళ్ళల్లో సిగ్గు, మందలింపు ఒక లిప్త కాలం పాటు కనిపించాయి. ఆ వెంటనే కనురెప్పలు బరువుగా వాలిపోయాయి. తడిసిన చీర చెంగును భుజం మీదుగా కొంచెం జార్చి ఓ పక్కగా పిండుకుంటుంటే, అజంతా శిల్పసుందరిలా, ఎల్లోరా చిత్రమంజరిలా... ఓహ్! ఎంత కమనీయ కావ్య దృశ్యం! అంతటి అందం, అపూర్వ లావణ్యం, నా ఇంట్లో... గబగబా తేరుకున్నాను.

అప్పటికే వరండాలోకి వానజల్లు ఉధృతంగా కారుతోంది. గబగబా లోపలికి వెళ్ళి గుమ్మం కర్టెన్ తొలగించి, ఆమె వైపు లోపలికి రమ్మన్నట్లు, చూశాను. నెమ్మదిగా, తడిసిన కుచ్చెళ్ళు కాళ్ళకడ్డం రాకుండా ఒక చేత్తో కొంచెం గా ఎత్తి పట్టుకొని లోపలికి అడుగు పెట్టింది. పద్మాల వంటి సుతిమెత్తని పాదాలు! స్టాండ్ మీదనున్న టవల్ తీసి అందించాను. రాయంచలాగా గోడకానుకుని ఉన్న డ్రెస్సింగ్ టేబుల్ ముందుకు వెళ్లి అద్దంలోకి చూస్తూ ముఖం తుడుచుకుని మునివేళ్ళతో ముంగురులు సరి చేసుకోసాగింది. బ్లౌజ్‌కీ, చీరకూ మధ్య జానెడు వెడల్పున గులాబిరంగు శరీరం! నడుము మీద ఓ సన్నని మెలిక , చీరకట్టులోకి జారిపోతూ! ఆమె అద్దం లోంచి క్రీగంట నన్నే గమనిస్తూ...

ఆపుకోలేని తమకం ఆవహించింది. నా కళ్ళు ఆమె వైపు నన్ను లాక్కెళ్ళాయి. నా చేతులు ఆర్తిగా ఆమె భుజాల చుట్టూ అల్లుకున్నాయి. ఆమె ముఖాన్ని నా వైపుకు తిప్పుకున్నాయి. పెదవులు వణుకుతున్నాయి. ఉద్రేకంతో శరీరం కంపించ సాగింది.

ఉచ్ఛ్వాస విశ్వాసాలు వేడిగా... బరువుగా...

"మమ్మీ ! నన్ను పలుకోబెత్తి....మలేమో... నువ్... ఎక్కలికెల్లావ్?"

అప్పుడే నిద్ర లేచిన నానీ రావటంతో ఉలిక్కిపడి దూరంగా జరిగాం ఇద్దరం.

చటుక్కున శెనగలమూట నా చేతిలో పెట్టి, నానీని చంకనెత్తుకుని ముద్దుపెట్టుకుంటూ లోపలి గదిలోకి జారుకుంది. కొంటె నవ్వు నాపుకుంటూ...

ఆమె !

ఆ సుందరి !!

నా అర్ధాంగి !



("పల్లకి" సచిత్ర వారపత్రిక 12.9.1985 సంచికలో)

# రససిద్ధి

**బా**త్రూం తలుపు స్లోగా తెరుచుకుంది.

శాండల్ వుడ్ పరిమళం గదంతా పరుచుకుంది. ఆమె మెల్లగా బయటకు వచ్చింది. వక్షాన్ని కప్పుతూ మోకాళ్ళ పైదాకా తెల్లటి టవల్ చుట్టుకుంది. ఫ్యాన్ గాలికి ఎగురుతున్న టవల్ అంచులు దాగున్న పరువాలను కొద్దికొద్దిగా బహిర్గతం చేస్తున్నాయి. ఆమె ఒళ్ళు సిమ్లా ఆపిల్‌లా నిగనిగలాడుతోంది. గుండ్రని అనాచ్ఛాదిత భుజాలు వింతగా ప్రకాశిస్తున్నాయి. ఫాలభాగం మీద,



శ్రీకారాల్లాంటి చెవుల అంచుల మీద, తెల్లని సబ్బు నురగ పాలమీగడలా మెరుస్తోంది. నిశ్శబ్దంగా నడుచుకుంటూ డ్రెస్సింగ్ టేబుల్ ముందుకు వెళ్ళింది. వీపుమీద జీరాడుతున్న వెంట్రుకలను సుతారంగా ముందుకు లాక్కుని గుండెల మీదకు వదిలింది. మెల్లగా టవల్ ను వదులు చేసింది. అది గుండెల మీంచి జారి, పొత్తికడుపు దాటి పిరుదులను రాచుకుంటూ, పాదాల మీద దాసోహం అంది. అనాచ్ఛాదితమైన ఆమె గులాబిరంగు ఒంటిమీద మెడ కిందుగా వీపుమీద, తామరాకుమీది నీటి బిందువుల్లా తామరాకు మీది... తామర... తామర..."

తదేకంగా చదువుతూ తన్మయావస్థలో మునిగిన వీరాసామి ఉలిక్కిపడ్డాడు. "అవునూ! ఇవాళే కదూ! తామర స్పెషలిస్ట్ శుక్రాచార్య హోటల్ గోవిందాలో బస చేసేదీ..."

ఒక్క ఉదుటున రోడ్డుమీదకురికి బయల్దేరాడు వీరాసామి. తామరతంపర లాంటి జనాల్ని చీల్చుకుంటూ !



("ఆంధ్రజ్యోతి" వారపత్రిక 12.10.1984 సంచికలో, కాలమ్ దాటని కథ)

# కాటేయని కరినాగు

— కందుకూరి వెంకటేశ్వర్లు

**మ**ధు మూర్తి:

ఇవాళ హనీమూన్ మొదటిరోజు. ఈ నాగార్జున సాగర్‌లో కాటేజీలో ఈ చలిలో ఇలా అఘోరిస్తున్నాం.

గుండె అంతా దిగులుగా ఉంది.

పెంచుకున్న కోరికల చెట్టు ఒక్కసారిగా కూలినట్లుగా ఉంది.

నేను ఊహించని అన్యాయం జరిగిపోయింది. ఇంతకాలం ఎన్నో పెళ్లి చూపుల్లో వెతికాను. అంతదాకా దేనికి? కొలీగ్ ఇందిరాదేవిని కాదనడానికి కారణం ఏముంది? ఇంకా ఎంతో మందిని కాదన్నందుకూ, అసలు కారణం వాళ్లకి చెప్పకుండా ఏదో ఒకటి చెప్పి తప్పించుకున్నందుకూ వాళ్ళ ఉసురు ఇలా తగిలిందా? అసలీ ఉసురు పోసుకోవటమంటే ఏమిటి? సహేతుకమైనదేనా?

విశాలాక్షక్కయ్య అనేది. మాధవరావు మామయ్య కూతుర్ని కాదన్నప్పుడు తిట్టి మరీ చెప్పింది.

“ఎడ్యుకేషనంటారు. ఫెయిర్నెసంటారు గానీ ఇదేమిట్రా ఇలా ఇంతమందిని ఉసూరుమనిపిస్తున్నావు. ఇదేం బాలేదు” అని.

అక్కయ్యకేం తెలుసు?

“కరినాగంటి జడ చూడు
అది కాటేస్తేనే మగవాడు!” అని ఘంటసాల నా గుండెలో నాలుగేళ్లుగా చేస్తున్న గోల.

ఆ మాటకొస్తే చాలా మందికి తెలియదు మొత్తం శరీరానికి పొడవాటి జడవల్ల ఎంత అందం వస్తుందో! ఏ అడ్డూ లేకుండా ఉండే నిడుపాటి నల్లటి వెంట్రుకల్నీ, వాటిని భరించే నునుపైన వీపునీ చూడటంలో ఎంత ఆనందం ఉంది? కొండ పైనుండే జలపాతం దూకుతున్నట్లుండదూ! జుట్టంతా ముందుకు తీసుకొనొచ్చి, మధ్యలోంచి అలలు అలలుగా కదిలినట్లనిపించే ముఖాన్ని చూడటంలో ఒక మధురిమ లేదూ! ఆషాఢ మేఘంచాటున పూర్ణ చంద్రోదయం లా ఉండదూ?

నాగుపాము లాంటి నల్లటి జడ నితంబసీమపై కుడిఎడమలుగా నర్తిస్తుంటే గుండె పొందే సంబరం సంగతేమిటి?



కన్యాకుమారిలో 'సన్రైజ్' చూస్తున్నట్లూ , సాగర్ డామ్ మీద 'సన్సెట్' చూస్తున్నట్లూ, కృష్ణశాస్త్రి కవిత చదువుతున్నట్లు అనిపించదూ !

ఏమైతే ఏం లాభం?

అర్హతలెన్నో ఉన్నా కేవలం అందమైన పొడవైన సొంత జడలేదని తిరస్కరించిన ఎనిమిది పైగా అమ్మాయిల తర్వాత దొరికిందనుకున్న ఆనందమూ,

తెలుగు లెక్చరర్ సుబ్రహ్మణ్యం అందించిన జడకుచ్చుల సాహిత్యమంతా సార్థకమైందని పొందిన సంతోషమూ... సర్వం లేకుండా పోయాయి. నల్లటి పొడవాటి పొందికైన ఒత్తయిన జడ!

నేను కలలు కన్న జడ!

తన వయ్యారపు నడకలో లోలకంలా కదులూ నా బ్రతుకు గడియారాన్ని నడుపుతుందనుకున్న జడ... ఏదీ... దొరికీ దొరికిందనుకుంటున్నప్పుడే చేజారిపోయింది.

ఏమో! అందరూ నాలాగే ఆలోచిస్తారనేముందీ? చాలామందికి సౌందర్యం అంటే పట్టటం లేదు. పెళ్ళిళ్ళన్నీ లవ్ కోసమో డబ్బు కోసమో జరుగుతున్న ట్లనిపిస్తున్నాయి. శారీరక సౌఖ్యం చాటున చాలా చాలా విషయాల్ని క్షమించేస్తున్నారు జనం.

అలా క్షమించలేక.... ఎందర్నో కాదన్నందుకు, వద్దన్నందుకు ఏమిటి ఫలం? సునందని ఏరి కోరి చేసుకున్నందుకు ఏది సంతోషం?

మెదడు మొద్దుబారిపోతుంది.

ఏం తోచటం లేదు.

పైలాన్ వైపునుంచీ ఇంకా బస్సుల గోల వినిపిస్తూనే ఉంది. మొగలిపూల జడలాగా వెన్నెల్లో తెల్లగా ఉంది రోడ్డు. విరజాజుల జడలోంచి పరిమళం ఎగిరి వచ్చినట్లుగా అప్పుడప్పుడు చల్ల గాలి వీస్తోంది.

సునందకు పొడవైన జుట్టు ఉంది. కానీ ఏం లాభం? మోసం జరిగిపోయింది. మళ్లీ మళ్లీ దిద్దుకోలేని మోసం.

తను ఆమె ఒళ్ళో తలవాల్చి జడతో ఆడుకుంటూ " కలకలలాడు వాలుజడ కై జగమెంత తపంబొనర్చెనో చెలియా... నన్నోరమణీ... ధరింపుమిక నొక్కుల పాయలలో గులాబిగాన్" అంటూ రామచంద్ర అప్పారావు గారి కవిత వినిపించి ఆనందిద్దామనీ... చేమకూర వారి పద్యాలు పలుకుదామనీ... ఇంకా...ప్చ్...

నేననుకున్న ఆలోచన. అలలన్నీ విరిగిపోయాయి. అక్కయ్య వరకూ, అమ్మ వరకూ వచ్చిన నిజం అక్కడే ఆగిపోయింది.

సునంద మాత్రం ఏం చేస్తుంది?

ఏం చేస్తోంది?

బోర్లా పడుకుని ఉంది సునంద. మంచి నిద్రలో ఉన్నట్లుంది. తెల్లటి చీర మీద, వీపు పైన వాటేసుకుని పడుకున్నట్లు గా కనిపిస్తుంది నలిగిన నల్లటి పొడవైన కరినాగులాంటి జడ. రేపిల్లాంటి జడను తను వేసుకోలేదు కదా! మరి ఏం చేస్తుంది?

తెలివైన అమ్మాయే! వ్యూ పాయింట్ లోంచి డామ్ చూసిన తరువాత వస్తుండగా లెఫ్ట్ కెనాల్ పొడవెంతంటే కరెక్ట్ గా చెప్పేసింది. మాటా పలుకు కూడా పర్వాలేదు. కానీ జడ మాత్రం నలిగి పోయింది కదా మళ్లీ వేసుకోమంటే ఎంతో భయంగా తప్పు చేసినట్లుగా చెప్పింది. జడ వేసుకోవడం తన వల్ల కాదట. చిన్నప్పుడు వచ్చిన పోలియో వల్ల కుడిచెయ్యి పైకి లేవదుట. ఇంకే పనీ చేసుకోవటానికి ఇబ్బంది కాదుట. బాగా జడ వేసుకోవడం చేతకాకపోయినాక ఇంకే పని సాధ్యపడితే మాత్రం ఏవుందీ?

ఏమిటో? మనసంతా శూన్యం గా ఉంది.

పొడవైన కురులు ఉన్నాయి. కానీ అవి జడగా మారవు.

వీణ ఉంది. శ్రుతి చేసి ఆలపించేవారు లేరు.

* * *

సునంద:

మధ్యాహ్నం ఎండలోపడి ఈ సాగర్ వచ్చాం. హనీమూన్‌ట. ఆ మాట అనగానే ఏవేవో పాత జోకులు గుర్తుకొస్తున్నాయి. వస్తుంటే స్వప్న తెగ వెక్కిరించింది.

"హడావుడిగా పెళ్ళాడావు. అర్జెంటుగా హనీమూన్ కెడుతున్నావు. మీ ఆయన్ను చూస్తే మాంఛి ప్రోగ్రెసివ్‌లా కన్పిస్తున్నాడు. క్విక్ రిజల్ట్స్ వస్తాయేమో!"

మరీ మగ జోకు.

ఏదో కొత్త లోకంలో తిరుగుతున్నట్లుగా ఉంది. చేతిలో చెయ్యేసుకు సైదోడుగా నడుస్తుంటే! ఏదో ధైర్యంగా కూడా ఉంది. ఇంకా బాగా చనువు ఏర్పడకపోయినా కొత్తదనం మాత్రం పోయింది. అయినా పెళ్లయి ఎన్ని రోజులయిందని! ఈ పెళ్లి కాకుండా ఉంటే ఇంకా నాలుగు ఛేజ్ నవలలైనా చదివుండేది తను. హాయిగా ఎమ్మెస్సీలో న్యూక్లియర్ ఫిజిక్స్‌కో మరో దానికో అప్లై చేసి ఉండేది ఈపాటికి. మంచి సంబంధమనీ, మంచి ఉద్యోగమనీ మొహమాట పెట్టేశారు ఆ నావెల్స్ ఎక్కడికి పోతాయన్చెప్పి. విచిత్రంగా ఇప్పుడు ఏమీ చదవాలనే అనిపించటం లేదు.

ఎక్కువగా జడ చేతిలోకి తీసుకుంటారు. జడంటే బాగా ఇష్టంలా ఉంది. డామ్ మీద నడుస్తున్నప్పుడు కూర్చుంటున్నప్పుడు జనం లేని చోట చిలిపి పనులకు మాత్రం తక్కువేంలేదు.

ఫర్వాలేదు. నో ప్రాబ్లం. ఏదో కవిత్వమంటే ఇష్టంలా వుంది. "ఆకాశం పడుకుంటోంది చూశావా?" అన్నారు సాయంత్రం.

కాఫీ, టీ తాగరట. మైనస్ మార్కు. అలా అయితే నా సంగతేమిటి? అర్జంటుగా అలవాటు చెయ్యాలి.

ఇంటిదగ్గర బయల్దేరిందగ్గర్నుండీ ఆనందంగా వున్నట్లుండి ఫోంచేసి రాగానే హఠాత్తుగా ఏదో పోగొట్టుకున్నట్లు ఈయన బయటకెందుకెళ్ళినట్లు?

తనేమందని? ఉన్న విషయమేదో చెప్పింది. జడేసుకోలేనని అంది. ముందే చెప్పిన విషయమేగా!

బయట చలికూడా ఎక్కువగానే వుండి వుండాలి. మరెందుకలా కూర్చునట్లు?

కూర్చున్న భంగిమ బావుంది. కాళ్ళు మడిచి పెట్టుకుని దిగులుగా దిగంతాలకేసి చూడటం.

"మీ ఆయనకు సినిమా ట్రిక్కులు తెలుసేవ్" అంది పొద్దున స్వప్న రహస్యంగా. ఇది అందులో భాగమా?

"జడ ముందుకేసుకో బావుంటదని" సలహా ఆయనకో... నాకో! ఇంకా ఏమిటబ్బా ఏదో అన్నారు. ఆ.. అలా ముందు కేసుకుంటే రెండు ఇసుక తిన్నెల మధ్యగా తిరుగాడే కృష్ణమ్మలా ఉంటుందట జడ. సిగ్గుగా ఉంది ఆ మాటలకి.

ఇవాల్టికే బాగా నలిగిపోయిందీ జడ! రేపెలాగో ఏమో? నిద్రొచ్చేస్తోంది. ఇంట్లో అమ్మో, వదినో ఎవరో ఒకరు జడేసేవారు. ఇకముందెలాగో?...

* * *

చాలా టైమైనట్లుంది లేచేసరికి. గబగబా పనులు ముగించుకుని స్నానం కానిచ్చి చీర కట్టుకున్నాను. కుచ్చిళ్ళు సర్దుకుని పాదాల దగ్గర మడత పడినట్లుంటే సరి చేద్దామని ముందుకు వంగాను. వెనక ఎవరో పట్టుకున్నట్లయింది. తిరిగి చూశాను. ఇది మరీ ఆశ్చర్యం!! ఆయన!

ఓ చేతిలో నా జడ. మరో చేతిలో దువ్వెన!!

అదే కొంటె నవ్వు.

"ఏ గగనమో కురుల జారి నీలిమైపోయె..." సన్నగా పాట.

("పల్లకి" సచిత్ర వారపత్రిక 4.10.1984 సంచిక)



## డా. కందుకూరి వేంకటేశ్వర్లు



జననం: 1956
స్వస్థలం: మచిలీపట్నం
ప్రస్తుతం: గుంటూరు
చదువు: MCom, PhD
వృత్తి: ప్రభుత్వ కళాశాల(రిటైర్డు) ప్రిన్సిపాల్
అభిరుచి: అన్ని రకాల కవిత్వాలు, సాహిత్యాలు. భారతీయత. వక్త. వచన కవి. స్నేహి.

# ఓ ఇంటి భాగోతం

- కవితా శ్రీనివాస్

"మీ ఆవిడ ఉందా ఇంట్లో?"

"లేదులే , ఊరెళ్ళింది. ఏం?"

"నీతో ఒక ముఖ్యమైన విషయం మాట్లాడదామని" సంకోచంగా నసిగాడు వెంకట్రావ్.

"చెప్పు! పరవాలేదులే ఎవరూ లేరు కదా!" అన్నాడు సుందర్రావు.

"నా పెళ్లయి ఆరో సంవత్సరం. అప్పుడే మా సంసారంలో చాలా మార్పులు వచ్చేసినాయి సుందర్రావ్!... ముఖ్యంగా ఆ ఒక్క విషయంలో నా కోరికను వ్యతిరేకిస్తోంది. గట్టిగా ఎప్పుడైనా మొండిగా మారాం చేసినా ఫలితం కనిపించడం లేదు! నిమ్మకు నీరెత్తినట్లు త్రోసిపుచ్చుతోంది. నాకేమీ పాలుపోవడం లేదు.. ఎంతైనా మగవాళ్లం కదా!"

"నీ బాధ నాకర్థమైంది వెంకట్రావ్! నీ మాట వాస్తవమే! పెళ్లయిన మూడేళ్లకు కానీ మాకు సంతానం కలగలేదు. ఆపైన వెంటవెంటనే ఇద్దరు పుట్టుకొచ్చారు. కానీ తను ససేమిరా ఒప్పుకోవటం లేదు! పిల్లలు పెద్దవాళ్లవుతున్నారు! వాళ్లకు తెలిసేలా ఘర్షణ పడడం ఏం బాగుంటుంది? మరీ ఇబ్బందిగా ఉంటోంది.

ఇన్నాళ్ళకి అవకాశం వచ్చింది. వాళ్ళ అమ్మకు ఒంట్లో బాగాలేదని టెలిగ్రాం వస్తే పంపించాను పిల్లలతో సహా! ఓ వారం పది రోజుల వరకూ పరవాలేదు. ఉన్నప్పుడెలానూ కుదరదు. లేనప్పుడైనా సుఖపడదామని, అనుకోవడంలో తప్పులేదు!" సానుభూతిగా తన బాధ కూడా వివరించాడు సుందర్రావు.



"నిన్నూ మీ ఆవిడ అలానే చేస్తోందని ఎప్పుడో మాటల్లో అంది మా ఆవిడ! ఎలాగూ నీకూ ఆ సమస్య ఉంది కాబట్టి నాకు తప్పక సాయం చేస్తావని... ఇలా ఓ రకంగా సిగ్గు విడిచి మరీ నీకు చెప్పాను. ప్లీజ్! నాక్కూడా ఎవరినైనా చూసి... ఎంతైనా అనుభవం ఉన్నవాడివి."

"దీన్లో అంత సిగ్గుపడాల్సింది ఏముంది. మొదట్లో నేనూ నీకు మల్లెనే కొంచెం సంశయించినప్పటికీ తర్వాత తర్వాత ధైర్యం చేశాను. వీలైనప్పుడల్లా మా ఆవిడని ఊరు పంపించి మనస్ఫూర్తిగా సుఖపడుతున్నాను. ఎంతైనా ఆ రిలాక్సేషన్ వేరు!"

"మరి పక్కవాటావాళ్ళెవరికైనా తెలిస్తే ఎలా?" అన్నాడు వెంకట్రావు, సుందర్రావు మాటలకి అడ్డం వస్తూ !

"ఎవరికన్నా ఈ సంగతి తెలిస్తే మా ఆవిడ రాగానే చెప్పెయ్యరూ! అందుకే మరీ పగటిపూట కాకుండా.... కొంచెం చీకటి పడ్డ తర్వాత రమ్మనమని మొదటిసారి వచ్చినప్పుడే చెప్పాను. ఆమెకు అలవాటైపోయి, ఎవరికంటా పడకుండా జాగ్రత్తగానే వస్తుంది. అయినా అదంతా నేను చూసుకుంటాను గదా!" ధైర్యం చెప్పాడు సుందర్రావు.

"చాలా తెలివైనదే అయి ఉండాలి! ఇంతకీ పేరేమిటి?"

"వరహాలని!..."

"వయసెంత ఉంటుందేమిటీ...?"

"మనకు వయసుతో పనేముంది. పని ముఖ్యం!.... ఈ వివరాలన్నీ అడుగుతున్నావు.. కొంపదీసి మా ఆవిడ రాగానే చెప్పటానికి కాదు గదా!"

"ఛ....ఛ....! భలేవాడివే! వివరాలు తెలిస్తే మన విషయం గురించి మరెవరికైనా చెప్పే రకమా? కాదా? అని కొంతవరకూ ఆలోచించాలి కదా! అందుకని!"

"అటువంటిదేమీ జరగదులే! నాకేమీ కొత్త కాదుగా! దాదాపు సంవత్సరం నుండి ఇలా జరుపుకొస్తున్నాను. రాత్రికి నా పని అయిపోగానే మీ ఇంటికి తీసుకొని వస్తాను సిద్ధంగా ఉండు. లేదా ముందుగానే నీ దగ్గరకు తీసుకురమ్మంటావా?"

"అబ్బెబ్బె! ముందయితేనేం? వెనకయితేనేం? నీ కెలా వీలయితే అలా! ఎవరికంటా పడకుండా మాత్రం తీసుకొనిరా! దొడ్డిగుమ్మం తలుపు కొడితే తీస్తాను" అని చెప్పి ఇంటికి వచ్చేశాడు వెంకట్రావు తను కూడా!

శీతాకాలం కావడం వలన సాయంత్రం ఆరు గంటలకే చీకటి పడిపోయింది. ఒకసారి గదిలోకి వెళ్ళి అన్నీ సిద్దంగా ఉన్నాయో, లేదోనని మరోసారి చూసుకొని స్నానం చేసి వచ్చి సుందర్రావు కోసం కాచుకుని కూర్చున్నాడు వెంకట్రావు.

తలుపు చప్పుడు విన్పించగానే గభాలున వెళ్ళి తలుపు తీశాడు. ఎదురుగా సుందర్రావు.

"ఏదీ? రాలేదా?" అన్నాడు ఎంతో నిరుత్సాహం నిండిన కంఠంతో.

నవ్వాడు సుందర్రావు.

"వెనకాతల వస్తోంది. ముందు మనం లోపలికి వెళ్దాం. తలుపు దగ్గరగా వేసి రా" అంటూ లోపలకు వచ్చాడు.

తర్వాత మెల్లిగా వచ్చింది వరహాలు.

వెంకట్రావు వంక చూచాడు సుందర్రావు.

"త్వరగా పని కానియ్యి. ఆ తర్వాత అలా వెళ్లి కాఫీ తాగొద్దాం" అంటూ ముందు గదిలోకి వెళ్ళి కూర్చున్నాడు.

ఓ అరగంటలో వచ్చేశాడు వెంకట్రావు.

"అయిపోయిందా అప్పుడే!"

"నేనే తొందర పెట్టాను... డబ్బులిచ్చి పంపేసాను".

"ఏం?"

"ఎవరైనా వస్తారేమోనని!"

"భలేవాడివే! నేను ఇక్కడే ఉన్నానుగా!"

"సరేలే! కాఫీకి పోదాం పద!"

తలుపులకు తాళం వేసి నడుస్తూ అన్నాడు సుందర్రావుతో వెంకట్రావు, సిగరెట్ పొగను గాలిలో ఊదుతూ రిలాక్సింగ్‌గా.

"నువ్వు చేసిన సహాయానికి కాఫీయే కాదు, టిఫిన్ కూడా ఇప్పిస్తాను... వంటయితే ఏదో తంటాలు పడగలం గానీ ఆ అంట్ల గిన్నెలు కూడా తోమాలంటే ఏదో చిన్నతనంగా ఉండి మనసెందుకో ఒప్పుకొని చావదోయ్. మనవాళ్లు ఉన్నప్పుడు ఎలాగూ తప్పటం లేదు. కనీసం వాళ్లు లేనప్పుడైనా ఇలా ఆ పనమ్మాయిని పిలుచుకొని ఆ పనిని కానిచ్చేస్తే నువ్వన్నట్లు ఆ టైములోనన్నా సుఖపడవచ్చు... చాలా పనిమంతురాలోయ్! గిన్నెలన్నీ చక్కగా తళతళా తోమింది. నిజంగా నీకు చాలా థాంక్స్!" 

("పల్లకి" 17.10.1985 సంచికలో)